దాదా భగవాన్

# సర్వత్ర సర్దుకొనిపొండి

**Telugu translation of the English book**
**"Adjust Everywhere"**

# సర్వత్ర సర్దుకొనిపొండి

**- దాదా భగవాన్**

సంపాదకులు :

డా॥ నీరుబెన్ అమీన్

**Publisher** : **Mr. Ajit C. Patel**
**Dada Bhagwan Aradhana Trust**
Dada Darshan, 5, Mamtapark Society
B/h. Navgujrat College, Usmanpura,
Ahmedabad-380014,
Gujarat, India.
**Tel. :** +91 79 3983 0100



**First Edition :** 1500 copies, October 2015

**Price** : Ultimate Humility (leads to Universal oneness) and Awareness of "I Don't Know Anything"

Rs. 10.00

**Printer** : Amba Offset
Basement, Parshwanath Chambers,
Nr. RBI, Usmanpura,
Ahmedabad-380014, Gujarat, India.
Tel. : +91 79 27542964

# త్రిమంత్రము

(సర్వవిఘ్న నివారణ చేసే త్రిమంత్రములు)

**నమో అరిహంతాణం**

తమ అంత:శత్రువులైన క్రోధ, గర్వ, లోభ, మోహములను నాశనము చేసిన వారందరికి నా నమస్కారము.

**నమో సిద్ధాణం**

ఆత్యంతిక మోక్షమును పొందిన వారందరికీ నేను నమస్కరించుచున్నాను.

**నమో ఆయరియాణం**

ఆత్మసాక్షాత్కారమును పొంది మోక్షమార్గమును చూపిన ఆచార్యులందరికీ నా నమస్కారము.

**నమో వజ్ఝాయాణం**

ఆత్మ జ్ఞానమును పొందిన ఆధ్యాత్మిక మార్గ గురువులందరికి నా నమస్కారము.

**నమో లోయే సవ్వసాహుణం**

ఆత్మ జ్ఞానమును పొంది ఆ మార్గంలో పురోగమించుచున్న ఈ విశ్వంలోని సాధువులందరికీ నేను నమస్కరించుచున్నాను.

**ఏసో పంచ నముక్కారో**

ఈ ఐదు నమస్కారములు

**సవ్వ పావప్పనాశనో**

సమస్త పాపములను నాశనము చేయును.

**మంగళానాం చ సవ్వేసిం**

మంగళప్రదమైన వాటి అన్నింటిలో

**పఢమం హవయి మంగళం**

ఇది సర్వోత్కృష్టము.

**ఓం నమో భగవతే వాసుదేవాయ**

మానవుని నుంచి మాధవునిగా మారిన వారందరికి నా నమస్కారము.

**ఓం నమ: శివాయ**

మానవాళి మోక్షార్థమై సాధనాలుగా మారిన విశ్వంలోని మంగళస్వరూపులందరికీ నా నమస్కారము.

జై సత్ చిత్ ఆనంద్

శాశ్వతమైన దానియొక్క ఎరుకే ఆనందము.

# జ్ఞాని పురుషుని యొక్క పరిచయం

అది 1958వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంత్రం సుమారు ఆరు గంటల సమయం, పశ్చిమ భారత దేశంలోని దక్షిణ గుజరాత్‌లోని ఒక పట్టణమైన సూరత్ రైల్వే స్టేషను. అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ నామధేయుడు, వృత్తి రీత్యా కాంట్రాక్టరూ అయిన ఒక గృహస్థుడు జనసమూహంతో రద్దీగా వున్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో నలభైఎనిమిది నిమిషములపాటు ఒక అద్భుతం జరిగింది. అకస్మాత్తుగా అంబాలాల్ మూల్‌జీభాయ్ పటేల్‌లోని ఆత్మ సాక్షాత్కారమైంది. ఆ సమయంలో అతని అహంకారం సమూలంగా దగ్ధమైపోయింది. ఆ క్షణం నుంచి అతను అంబాలాల్ యొక్క ఆలోచనలు, వాక్కు మరియు క్రియలన్నింటినుంచి పూర్తిగా వేరుచేయబడి, జ్ఞానమార్గం ద్వారా మానవాళికి ముక్తిని ప్రసాదించే నిమిత్తం భగవంతుని చేతిలో సజీవ పరికరంగా మారారు. ఆయన తనకు ప్రకటితమైన పరమాత్మని దాదాభగవాన్ అని పిలిచారు. "ఈ పరమాత్మ, దాదాభగవాన్ నాలో పూర్ణరూపంలో వ్యక్తమైనాడు; మీలో అవ్యక్తంగా ఉన్నాడు. భేదం ఇంతమాత్రమే. ఆయన జీవులందరిలోను విరాజమానుడై ఉన్నాడు.'' అని తనను కల్సిన ప్రతి ఒక్కరితోనూ చెప్పేవారు.

మనం ఎవరము? భగవంతుడంటే ఏమిటి? జగత్తును ఎవరు నడిపిస్తున్నారు? కర్మ ఏమిటి? మోక్షం ఏమిటి? ఇత్యాది సమస్త ఆధ్యాత్మిక ప్రశ్నలకు ఆ సందర్భంలో సమాధానం లభించింది. ప్రకృతి శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ ద్వారా ప్రపంచానికి సంపూర్ణ తత్త్వరహస్యాన్ని వెల్లడిచేసింది.

శ్రీ అంబాలాల్ జన్మస్థలం బరోడాపట్టణ సమీపంలోని తారాసలి; పెరిగింది గుజరాత్‌లోని బాదరణ్ గ్రామం. ఆయన ధర్మపత్ని హీరాబా. వృత్తిరీత్యా కాంట్రాక్టరు అయినప్పటికీ ఆత్మసాక్షాత్కారం పొందటానికి ముందు కూడా అతని వ్యావహారిక జీవనం ఇంట్లోను, చుట్టు ప్రక్కలవారితోను కూడా ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేది. ఆత్మ సాక్షాత్కారం పొందిన తరువాత జ్ఞానిగా ఆయన జీవితం ప్రజలకే అంకితమైంది.

వ్యాపారంలో ధర్మం ఉండాలి, ధర్మంలో వ్యాపారం ఉండకూడదు అనే నియమాన్ని ఆయన జీవితమంతా అమలుపరచారు. భక్తులచే దాదాశ్రీగా పిలువబడే ఆయన ఎన్నడూ ఎవరినుంచీ స్వంత ఖర్చుల నిమిత్తం ధనాన్ని స్వీకరించలేదు. పైగా తనకు వ్యాపారంలో లభించిన లాభాలను, భక్తులను భారతదేశంలోని వివిధ యాత్రా స్థలాలకు తీసికొనివెళ్లటానికి వినియోగించేవారు.

దాదాజీ మాటలు అక్రమవిజ్ఞాన్‌గా పిలువబడే కొత్త, డైరెక్ట్ మరియు మెట్లదారికాని లిఫ్ట్ మార్గమైన ఆత్మానుభూతి మార్గానికి పునాది అయ్యాయి. అతడు తన దివ్య ప్రాచీన విజ్ఞాన ప్రయోగం (జ్ఞాన విధి) ద్వారా కేవలం రెండు గంటలలో ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందచేశారు. వేలకొలది ముముక్షువులు ఈ విధానం ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందినారు, ఇప్పటికీ వేలకొలది ముముక్షువులు పొందుతూనే ఉన్నారు. అక్రమమార్గం అంటే మెట్లు లేనిది, లిఫ్ట్‌మార్గం లేక షార్ట్‌కట్ మార్గం. క్రమ మార్గం అనగా మెట్టుతర్వాత మెట్టు క్రమంగా ఎక్కే ఆధ్యాత్మిక మార్గం. ఇపుడు అక్రమమార్గం ఆత్మానుభూతి నిమిత్తం డైరెక్ట్, షార్ట్‌కట్ మార్గంగా గుర్తింపబడింది.

## దాదా భగవాన్ ఎవరు?

దాదా భగవాన్ ఎవరు? అనే విషయాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు :

"మీకు కన్పించేది 'దాదాభగవాన్' కాదు. మీరు చూస్తున్నది ఎ.ఎమ్. పటేల్‌ని. జ్ఞానిపురుషుడనైనా నాలోపల పూర్ణరూపంలో వ్యక్తమైన భగవంతుడు 'దాదాభగవాన్'. ఆయన చతుర్దశ భువనాలకు ప్రభువు. ఆ దాదాభగవాన్ మీలోను, ప్రతి ఒక్కరిలోను కూడా ఉన్నారు. మీలో అవ్యక్తరూపంలో ఉంటే, ఇక్కడ (ఎ.ఎమ్. పటేల్ దేహంలో) సంపూర్ణంగా అభివ్యక్తమైనాడు. నేను దాదా భగవాన్ కాదు. నాలోపలి దాదాభగవాన్‌కి నేను కూడా నమస్కరిస్తాను.

## జ్ఞాన (ఆత్మజ్ఞాన) ప్రాప్తికై వర్తమానలింక్

"నేను స్వయంగా సిద్ధులను (ప్రత్యేక ఆధ్యాత్మిక శక్తులను) కొద్దిమందికి ప్రసాదించబోతున్నాను. నేను వెళ్లిపోయిన తర్వాత వాటి అవసరం ఉండదా ? భవిష్యతరాల ప్రజలకు ఈ మార్గం యొక్క అవసరం ఉంటుంది, అవునా?''

- దాదాశ్రీ

పరమపూజ్య దాదాశ్రీ గ్రామ గ్రామమూ, దేశవిదేశాలు పర్యటించి ముముక్షువులకు సత్సంగంతోపాటు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించారు. దానితోపాటు సంఘీభావంతో కూడిన ప్రాపంచిక వ్యవహార జ్ఞానాన్ని కూడా తనను కల్సిన వారందరికీ అందించారు. ఆయన తన అవసానదశలో, 1987 చివర్లో తన కార్యాన్ని కొనసాగించే నిమిత్తం డాక్టరు నీరుబెన్ అమీన్‌కి సిద్ధులను అనుగ్రహించారు.

పరమపూజ్య దాదాశ్రీ జనవరి 2, 1988న దేహత్యాగం చేసిన తర్వాత డా॥ నీరుబెన్ భారతదేశ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ, ప్రపంచంలోని అన్ని ఇతర దేశాలలోనూ పర్యటిస్తూ దాదాశ్రీ కార్యాన్ని కొనసాగించారు. మార్చి 19, 2006న దేహత్యాగం చేసేవరకు ఆమె అక్రమవిజ్ఞాన్‌కి దాదాశ్రీ ప్రతినిధిగా వున్నారు. దేహ త్యాగానికిముందు ఆమె ఆ కార్యభారాన్ని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్‌కి అప్పగించారు. ఆధునిక కాలంలో ఆత్మానుభూతికి సరళమూ మరియు డైరెక్ట్ మార్గంద్వారా అక్రమ విజ్ఞానాన్ని వ్యాపింపచేయటంలో డా. నీరుబెన్ సాధనం అయి ప్రముఖ పాత్రను పోషించారు. లక్షల కొలది ముముక్షువులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నారు. వారు తమ సంసార బాధ్యతలు నిర్వర్తిస్తూ కూడాస్వేచ్ఛను, శాంతిని, ఆత్మరమణత యొక్క అనుభూతిని పొందుతున్నారు.

అక్రమ విజ్ఞాన సత్సంగం నిర్వహించే నిమిత్తం జ్ఞాని పురుష్ దాదాశ్రీ పూజ్య నీరుబెన్ అమీన్ సమక్షంలో శ్రీ దీపక్‌భాయ్ దేశాయ్‌కి సిద్ధిని ప్రదానం చేశారు. 1988-2006 మధ్యకాలంలో దాదాశ్రీ దిశానిర్దేశానుసారం, డా. నీరుబెన్ అమీన్ నాయకత్వంలో దేశవిదేశాలలో శ్రీ దీపక్ భాయ్ సత్సంగ్ నిర్వహించారు. ఈ అక్రమ విజ్ఞాన్ యొక్క జ్ఞానవిధులు, సత్సంగ్‌లు ఇపుడు పూర్తిస్థాయిలో ఆత్మజ్ఞాని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్ మాధ్యమం ద్వారా కొనసాగుతున్నాయి.

శాస్త్రాలలోని శక్తివంతమైన పదాలు మోక్షకాంక్షను వృద్ధి చేయటంలో సహకరిస్తూ ఆ మార్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ముముక్షువులందరికీ ఆత్మజ్ఞానమే అంతిమ లక్ష్యం. స్వరూప జ్ఞానం లేకుంటే మోక్షం లేదు. ఈ జ్ఞానం పుస్తకాలలో లభించదు. అది జ్ఞాని హృదయంలో వుంటుంది. కనుక ఆత్మజ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞాని నుంచి మాత్రమే పొందగలం. అక్రమ విజ్ఞాన్ యొక్క విజ్ఞాన ప్రయోగం ద్వారా ప్రత్యక్ష జ్ఞానినుంచి నేడుకూడ ప్రతి ఒక్కరూ ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చు. ఒక జ్యోతి మాత్రమే మరొక దీపాన్ని వెలిగించగలదు.

* * * *

# అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుని దాదాశ్రీ లేక దాదా లేక దాదాజీ గా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన మరియు ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యధాతథంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్థం ముముక్షువులకు అందకపోవచ్చు అనికూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణసారాన్ని యధాతథంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇంగ్లీషు మరియు ఇతర భాషలలోకి అనువదించటానికి, తద్వారా ప్రపంచంలోని యావత్తు ప్రజానీకానికి అందించటానికి తమ ఆశీర్వాదాన్ని అనుగ్రహించారు. తనలో ప్రకటితమైన ఈ అక్రమ విజ్ఞానాన్ని ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం యొక్క అద్భుతమైన శక్తులను ప్రపంచం గుర్తించి ప్రణమిల్లే రోజు వస్తుందని కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాశ్రీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యధాతథంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఱుపు లేకుండా అందించడంకోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాథమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటినిమిత్తమై మేము మీ క్షమను అర్థిస్తున్నాము.

* * * *

# తొలి పలుకు

మనం ఇతరులతో ఎడ్జస్ట్ కావటం నేర్చుకొనేంతవరకు జీవితంలో మరల మరల సంఘర్షణలు సంభవిస్తూనే వుంటాయి. సరైన అవగాహన వల్లనే ఈ సర్దుబాటును సాధించవచ్చు. లేకుంటే జీవితం విషతుల్యం అవుతుంది. మన యిష్టానికి విరుద్ధంగా, ప్రపంచం బలవంతంగానైనా మనల్ని ఎడ్జస్ట్ అయ్యేలా చేస్తుంది. మనంతట మనమే సరైన అవగాహనతో ఎడ్జస్ట్ అయినట్లయితే సంఘర్షణలను నివారించి, శాంతి సంతోషాలను పొందగల్గుతాం. జీవితం అంటే కేవలం ఎడ్జస్ట్‌మెంట్ మాత్రమే, ఇంకా వేరేమీకాదు. జననం మొదలు మృత్యువు వరకు ఎడ్జస్ట్ కావలసి వుంటుంది. నవ్వుతూనో, ఏడుస్తూనో ఎలాగైనా ఎడ్జస్ట్ కాక తప్పదు. విద్యాభ్యాసం పట్ల ఆసక్తి వున్నా లేకున్నా ఎడ్జస్టు అయ్యి చదువుకోవలసి వుంటుంది. అదే విధంగా వైవాహిక జీవితంలో కూడ, ప్రారంభంలో ఆనందంగా వుంటుంది. కాని తర్వాత భార్యభర్తల మధ్య ఘర్షణలు తలెత్తినా పరస్పరం సర్దుకొని పోవలసి వుంటుంది. వారి భిన్న ప్రకృతుల కారణంగా ఈ ఘర్షణలు సహజంగా సంభవిస్తాయి. ఈ కాలంలో ఒకరితో ఒకరు జీవితాంతం సర్దుకొని పోగల అదృష్టవంతులెందరున్నారు? శ్రీరాముడు మరియు సీత కూడ ఎన్నిసార్లు ఎడ్జస్ట్ కాలేదు? గర్భవతి యైన సీత అడవులకు పంపబడినప్పుడు ఆమె ఎన్ని విధాల ఎడ్జస్ట్‌మెంట్ చేసికొని ఉంటుందో ఊహించండి.

తల్లిదండ్రులు మరియు సంతానం మధ్య అడుగడుగునా ఎడ్జస్ట్‌మెంట్స్ తప్పవు. అవగాహన పూర్వకంగా మనం ఎడ్జస్ట్ కావటం వల్ల శాంతి లభిస్తుంది, మనకి కర్మబంధాలు ఏర్పడవు. మన చుట్టుప్రక్కల వారితో మనం ఎడ్జస్ట్ కాకపోతే సమస్యలను ఆహ్వానించినట్లు లేదా సృష్టించుకొన్నట్లవుతుంది. "సర్వత్ర సర్దుకొని పొండి" (Adjust every where) అనే తాళంచెవి జీవితంలో అన్ని ద్వారాలను తెరుస్తుంది. జ్ఞానిపురుషుడు దాదాశ్రీ యొక్క "ఎడ్జస్ట్ ఎవ్విరివేర్" అనే స్వర్ణమయసూత్రాన్ని మన జీవితంలో అన్వయించుకొన్నచో జీవితం సుఖమయం అవుతుంది, సుందరంగా వుంటుంది.

డా. నీరుబెన్ అమీన్

## సర్వత్ర సర్దుకొనిపొండి.
## ఈ పదసముదాయాన్ని జీర్ణించుకోండి

ప్రశ్నకర్త : నేను నా జీవితంలో శాంతిని కోరుకుంటున్నాను.

దాదాశ్రీ : నీవు జీవితంలో ఒకే ఒక సంక్షిప్త వాక్యాన్ని అంగీకరిస్తావా? దానిని సరిగా, ఉన్నది ఉన్నట్లుగా వ్రాసుకో.

ప్రశ్నకర్త : సరే.

దాదాశ్రీ : "ఎడ్జస్ట్ ఎవ్విరివేర్" ఈ సంక్షిప్త వాక్యాన్ని నీ జీవితంలో కలుపుకో, అపుడు శాంతి రాజ్యమేలుతుంది. ప్రారంభంలో ఒక ఆరు నెలలపాటు కష్టాలు అనుభవించవలసి వుంటుంది. ఎందువల్లనంటే గతజన్మ రియాక్షన్లు ఆరు నెలల వరకు వస్తుంటాయి. తర్వాత శాంతి నీ స్వంతమవుతుంది. అందువల్ల సర్వత్ర సర్దుకొని పోవాలి. ప్రస్తుత భయావహ కలియుగంలో నువ్వు ఎడ్జస్ట్ అవ్వలేక పోతే నీ నాశనం తప్పదు.

నీవు ప్రాపంచిక జీవితంలో వేరేమీ నేర్చుకోకున్నా ఫర్వాలేదు. కాని ఎడ్జస్ట్ కావటం మాత్రం తప్పనిసరిగా నేర్చుకోవాలి. నీకు ప్రతికూలంగా ఉన్న వ్యక్తితో కూడ నువ్వు ఎడ్జస్ట్ అయినట్లయితే ఎన్ని కష్టాలు ఎదురైనా నీవు సంసార సాగరాన్ని దాటగలవు. ఇతరులతో ఎలా ఎడ్జస్ట్ కావాలో తెలిసిన వ్యక్తికి దుఃఖం కలుగదు. సర్వత్ర ఎడ్జస్ట్ కావాలి. ప్రతి ఒక్కరితోను ఎడ్జస్ట్‌మెంట్ (కలిసి ఉండటం, సమాధాన పడటం) అనేది అత్యున్నత ధర్మము. ఈ కాలంలో ప్రజలు విభిన్న ప్రకృతులు (విభిన్న వ్యక్తిత్వాలు, గుణగణాలు, అభిప్రాయాలు) కల్గి వుంటారు. అందువల్ల ఎడ్జస్ట్ కాకుండా జీవితం ఎలా సాగుతుంది?

## జోక్యం చేసికోవద్దు, సర్దుకొనిపోవాలి అంతే.

జీవితం నిరంతరం పరివర్తన చెందుతూనే వుంటుంది. అందువల్ల ఈ మార్పులకు అనుగుణంగా ఎడ్జస్ట్ కావలసి వుంటుంది. పెద్దవాళ్ళు తమ పాత పద్ధతులనే పట్టుకొని వ్రేలాడుతుంటారు. కాలంతో పాటు వారు ఎడ్జస్ట్ కావలసి వున్నది. లేనిచో అనంతమైన బాధలకు గురికావలసి వస్తుంది. కాలానుగుణంగా మీరు తప్పని సరిగా సర్దుబాట్లు చేసికోవాలి. నేను ప్రతిఒక్కరితో, ఒక దొంగతో కూడ ఎడ్జస్ట్ అవుతాను. అతనితో

నేను మాట్లాడే విధానాన్ని బట్టి అతడు నన్ను కారుణ్య మూర్తిగా గుర్తిస్తాడు. అతనిది తప్పని నేనతనికి చెప్పను. అతడు తన దృష్టి కోణాన్ననుసరించి ప్రవర్తిస్తున్నాడు. ప్రజలు సాధారణంగా దొంగని నిందించటం, నిరుపయోగమైన వ్యక్తిగా అతనిపై ముద్రవేయటం చేస్తుంటారు. మరి లాయర్ల విషయం ఏమిటి? వారు కూడ అబద్ధాలు చెప్పటం లేదా? మోసపు కేసులను కూడ వాదించి వారు గెలుస్తారు. ఇలా చేయటం వల్ల వారు వంచకులు కారా? వారు దొంగలను వంచకులుగా ముద్రిస్తారు. కాని తమ వంచనను న్యాయమని వాదిస్తారు. ఇటువంటి ప్రజలను మీరెలా నమ్మగలరు? అయినప్పటికీ వారు చెలామణి అవుతూనే వున్నారు. అవునా? నేనెవ్వరికీ వారిది తప్పని చెప్పను. వారి దృష్టికోణంలో వారు కరెక్ట్ కానీ వారి దుష్కర్మల పరిణామం ఎలా వుంటుందనే సత్యాన్ని వారికి వివరంగా చెప్తాను.

ముసలివారు ఇంట్లో ప్రవేశించగానే అనేక విమర్శలు, వ్యాఖ్యానాలు చేయటం మొదలుపెడతారు. "ఈస్టీరియో ఎందుకు? ఇది అలా ఉండాలి" వగైరా వ్యాఖ్యానాలు. వారు అనవసరంగా జోక్యం చేసుకొంటుంటారు. యువతరంతో స్నేహ పూర్వకంగా ఉండటానికి ఎందుకు ప్రయత్నించకూడదు? కాలం మారుతుంది. యువతరం కాలానుగుణమైన సదుపాయాలు లేకుండా జీవించాలని పెద్దలు ఎలా ఊహిస్తారు? ఏదైన కొత్త వస్తువును చూడగానే యువతరం దానిని కోరు కుంటుంది. కొత్తదనం ఏమీ లేకుండా జీవితం దేనికని వారు భావిస్తారు. కొత్త వస్తువులు వస్తుంటాయి, పోతుంటాయి; వృద్ధులు వాటిలో జోక్యం చేసికోరాదు. అవి మీకు అనుగుణం కానిచో వాటిని మీరు ఉపయోగించవద్దు. ఐస్‌క్రీం మిమ్మల్ని తననుంచి పారిపొమ్మని చెప్పటం లేదు. మీరు తినదల్చుకోకుంటే తినవద్దు. కాని వృద్ధులు ఆవిషయమై కోపగిస్తారు. ఈ అభిప్రాయ భేదాలన్నింటికి కారణం కాలం తెచ్చే మార్పులు. యువతరం కాలానుగుణంగా ప్రవర్తిస్తారు. వృద్ధులు మారే కాలంతోపాటు మారకపోగా, కుటుంబ సభ్యులతో ఎడ్జస్ట్ కాలేరు. మోహం అనేది తృప్తి పరుపజాలని కోరిక; మార్కెట్లో కొత్త వస్తువులు ప్రత్యక్షమవ్వగానే వాటిపై మోహం కల్గుతుంది. నేను నా బాల్యం నుంచి, ఈ ప్రపంచం సరైన దిశలో ప్రయాణిస్తుందా లేక అపసవ్యదిశలో ప్రయాణిస్తున్నదా అని లోతుగా విచారించాను. ప్రపంచాన్ని మార్చేశక్తి ఎవ్వరికీ లేదని, అందువల్ల కాలానుగుణంగా ప్రతి ఒక్కరు సర్దుకొని పోవటం తప్పనిసరి అని నేను కనిపెట్టాను. మీ కుమారుడు కొత్త టోపీ ధరించి యింటికివస్తే అతనికి కోపం పుట్టించే కంఠస్వరంతో

"ఇది నీకు ఎక్కడనుంచి వచ్చింది?'' అని అడగవద్దు. దానికి బదులుగా, ప్రేమతో "బాబూ! నీ కొత్త టోపీ చాలా బాగుంది. ఎక్కడిది? దీని ఖరీదు చాలా ఎక్కువా?'' అని అడగండి. ఈ విధంగా మీరు ఎడ్జస్ట్ కావాలి.

అసౌకర్యంలో సౌకర్యాన్ని చూడమని మన ధర్మం మనకి బోధిస్తున్నది. నాకు సంబంధించిన ఒక ఉదాహరణ చెప్తాను. ఒకరోజు ప్రక్కదుప్పటి మురికిగా ఉన్నదనే భావన నాకు కల్గింది. అపుడు మనసులోనే ఎడ్జస్ట్‌మెంట్ చేసుకొని ఈ దుప్పటి చాలా మెత్తగా ఉంది అనుకొన్నాను. దుప్పటి మురికిని పట్టించుకోకుండా దాని మృదుత్వాన్ని భావించటం వల్ల అపుడు నాకు చాలా సౌకర్యంగా అన్పించింది. పంచేంద్రియాలవల్ల లభించే జ్ఞానం మనకు అసౌకర్యాన్ని, దోషాలను చూపిస్తుంది. ఆత్మజ్ఞానం సౌకర్యాన్ని, సుగుణాలను చూపిస్తుంది. అందువల్ల ఆత్మలోనే వుండాలి.

## అనుకూలంకాని ప్రజలతో సర్దుబాటు.

మురుగు కాలువనుంచి దుర్గంధం వస్తే మనం ఫిర్యాదు చేస్తామా? దానితో పోట్లాటకు దిగుతామా? అదే విధంగా అననుకూలురు, వ్యతిరేకులు అయిన ఈ ప్రజలంతా దుర్గంధాన్ని వ్యాపింపజేస్తుంటారు. దుర్గంధాన్ని యిస్తే దానిని మురుగుకాలువ అంటున్నాం. మనోహరమైన సువాసనలు వెదజల్లేదానిని పుష్పం అంటున్నాము. రెండింటికి ఎడ్జస్ట్ కావాలి. వీతరాగస్థితిని (రాగద్వేషాలకు అతీతమైన స్థితిని) పొందమని అవి మనకు బోధిస్తున్నాయి.

మంచి, చెడు అనే నీ అభిప్రాయాలే నీ బాధలకు కారణం. రెంటినీ సమానంగా భావించటం నేర్చుకోవాలి. మన భావాలను సదా పరిశీలించుకోవాలి. ఏదైనా ఒక వస్తువును మంచిదని మనం చెప్పినపుడు, దానితో పోల్చిచూస్తే మిగిలిన వస్తువులు చెడ్డవిగా తోస్తాయి. మనల్ని బాధించటం మొదలు పెడతాయి. మంచి, చెడు అనే అభిప్రాయాలకు అతీతమైన స్థితిని మనం చేరినట్లయితే బాధ అనేదే ఉండదు. "సర్వత్ర సర్దుకొని పోవాలి'' (Adjust every where) అనేది నేను కనిపెట్టిన సూత్రము. ప్రజలు ఏమి చెప్పినా, అది అబద్ధమైనా, నిజమైనా మనం ఎడ్జస్ట్ కావాలి. ఎవరైనా నన్ను "నీకు వివేకం లేదు'' అన్నచో వెంటనే నేను యిలా చెప్పి ఎడ్జస్ట్ అవుతాను. "మీరు చెప్పింది నిజమే. నేనెప్పుడూ కొంచెం మందబుద్ధినే. దానిని మీరీరోజే గుర్తించారు. కానీ నా కీవిషయం నా చిన్నప్పటి నుంచే తెలుసు.'' మీరీ విధమైన ప్రత్యుత్తరమిచ్చినచో

అభిప్రాయ భేదాలనుంచి వైదొలగవచ్చు. వారు మరెన్నడూ మిమ్మల్ని బాధించరు. మీరు ఎడ్జస్ట్ కానిచో మీ యింటిని (జననమరణ చక్రం నుంచి ముక్తి, మోక్షము) ఎప్పుడు చేరుకుంటారు?

## భార్యతో సర్దుబాటు

ప్రశ్నకర్త : నేను నా భార్యతో ఎలా ఎడ్జస్ట్ కాగలను? ఆమె నాతో తర్కిస్తుంటుంది. దయ చేసి వివరించండి?

దాదాశ్రీ : నీవు పని ఒత్తిడివల్ల ఆలస్యంగా యింటికొస్తావు. ఆ కారణంగా ఆమె నీతో గొడవపడుతుంది. ఆమె తన అసమ్మతిని అరుస్తూ యిలా వ్యక్తం చేస్తుంది, “నీవు ఆలస్యంగా వస్తున్నావు. దీనిని ఇంకెంతమాత్రమూ సహించను.'' ఆమె తన సహనాన్ని కోల్పోయినందువల్ల నీవు యిలా చెప్పాలి, “నిజమే ప్రియా! నువ్వు చెప్పింది అక్షరాలా నిజమే. నువ్వు నన్ను వెళ్ళిపొమ్మంటే వెళ్ళి పోతాను. ఇంట్లోకి వచ్చి కూర్చోమంటే కూర్చుంటాను.'' అపుడామె “వద్దు, వెళ్ళవద్దు. యిక్కడ ప్రశాంతంగా విశ్రాంతి తీసుకోండి'' అని చెప్తుంది. ఆ తర్వాత మీరామెతో “నువ్వు భోజనం చెయ్యమంటే చేస్తాను లేకుంటే అలానే నిద్రపోతాను'' అని చెప్పాలి. “లేదు మీరు భోజనం చేయండి'' అని ఆమె మీకు సమాధానం చెబుతుంది. ఇదే సర్దుబాటు. ఉదయాన్నే నీకు వేడివేడిగా కప్పు కాఫీ లభిస్తుంది. కానీ నీవు ఉద్రిక్తతను పొందినచో ఆమె కూడ అసంతృప్తికరమైన రీతిలో ప్రతిస్పందించి ఉండేది. మర్నాడు ఉదయం కోపంతో కాఫీ కప్పును విసురుగా నీవైపు త్రోసి వుండేది. ఆమె ఉదాసీనవైఖరి మరో మూడు రోజులు కొనసాగి వుండేది.

## కిచిడీ లేదా పిజ్జా తిను.

దాదాశ్రీ : ఎలా ఎడ్జస్ట్ కావాలో తెలియకపోతే ఎవరు మాత్రం ఏం చేస్తారు? అతడు తన భార్యతో పోట్లాడవచ్చా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : అలాగా? భార్యతో కలహించటం వల్ల నీవు పొందేలాభం ఏమిటి? ఇప్పటికే ఆమె నీ సంపదను పంచుకొన్నది.

ప్రశ్నకర్త : భర్త గులాబ్‌జామ్ తినాలని కోరుకుంటాడు కాని భార్య దాని బదులుగా కిచిడీ తయరు చేస్తుంది. అందువల్ల వారు కలహించుకొంటారు.

దాదాశ్రీ : అలా వారు కలహించుకొన్న తర్వాత అతను గులాబ్‌జామ్‌ని పొందుతాడని నీవు తలుస్తున్నావా? కిచిడీ తినటం తప్ప అతడికి వేరే గత్యంతరం ఉండదు.

ప్రశ్నకర్త : అతను హోటల్‌నుంచి పిజ్జా తెప్పించుకొంటాడు.

దాదాశ్రీ : అలాగా, అయితే అతను గులాబ్‌జామ్‌తో పాటు కిచిడీని కూడ కోల్పోతున్నాడు. అతడు పిజ్జాతో సరిపెట్టుకోవలసి వుంటుంది. ఆమెకి ఏది అనుకూలమైతే అదే చేయమని అతను భార్యకి చెప్పాల్సింది. ఆమె కూడ తినాలి కదా! ఆమె భర్తతో “మీకేది ఇష్టమైతే అదే చేస్తాను. ఏమి చేయమంటారు?'' అని అడుగుతుంది. అపుడతను తనకి గులాబ్‌జామ్ తినాలని ఉన్నట్లు చెప్పాలి. కానీ అతడు మొదటే గులాబ్‌జామ్ చేయమని చెప్తే ఆమె అందుకు వ్యతిరేకంగా కిచిడీ చేస్తానని వాదిస్తుంది.

ప్రశ్నకర్త : ఈ అభిప్రాయ భేదాలు రాకుండా ఉండటం కోసం మీరేమి సలహాలు ఇస్తారు?

దాదాశ్రీ : నేను మీకు ఈదారి చూపిస్తాను, “సర్వత్ర సర్దుకొనిపొండి.'' ఆమె నీతో తాను కిచిడీ తయారు చేసినట్లు చెప్తే, అపుడు నీవు దానితో సరిపెట్టుకోవాలి. మిగతా సమయాలలో ఒకవేళ నీవు సత్సంగానికి వెళ్లాలనుకొంటున్నట్లు చెపితే అపుడామె నీతో ఎడ్జస్ట్ కావాలి. మొదట ఎవరు సూచన చేస్తే దాని ప్రకారం రెండవ వ్యక్తి ఎడ్జస్ట్ కావాలి.

ప్రశ్నకర్త : అపుడు వారు, ముందుగా ఎవరు మాట్లాడాలనే విషయమై పోట్లాడుకుంటారు.

దాదాశ్రీ : అవును అలాగే చేయాలి. ఏది ఏమైనా ఒక వ్యక్తి రెండవ వ్యక్తితో ఎడ్జస్ట్ కావాలి. ఎందువల్లనంటే ఏదీ మీ అధీనంలో లేదు. ఈ నియంత్రణ ఎవరి చేతుల్లో ఉన్నదో నాకు తెలుసు. అందువల్ల, ఇలా సర్దుకొని పోవటం వల్ల నీకైమైనా యిబ్బందులున్నాయా?

ప్రశ్నకర్త : ఏమీ లేదు.

దాదాశ్రీ : (ప్రశ్నకర్త యొక్క భార్యతో) దానివల్ల నీకేమైనా సమస్యలున్నాయా?

ఆమె : లేదు.

దాదాశ్రీ : అటువంటప్పుడు మీరీ విషయాన్ని ఎందుకు పరిష్కరించుకోరు? ప్రతి విషయంలోనూ సర్దుకొనిపొండి. అపుడేదైనా సమస్య మీకు కన్పిస్తుందా?

ప్రశ్నకర్త : ఏ మాత్రం ఉండదు.

దాదాశ్రీ : లడ్డూలు, కూరలతో రుచికరమైన భోజనం తయారుచేయమని మొదట అతను మీతో చెప్తే దాని ప్రకారం మీరు  ఎడ్జస్ట్ కావాలి. చాలా అలసిపోయానని త్వరగా నిద్రపోవాలనుకుంటున్నానని మీరు అతనికి చెప్పినట్లయితే అతడు తన స్నేహితుని కలిసే పనిని వాయిదా వేసుకొని ఎడ్జస్ట్ అయి త్వరగా నిద్రించాలి. మీరు మీ స్నేహితుడిని తర్వాత కలవవచ్చు కాని యింట్లో మీ ఇద్దరి మధ్య వివాదం తలెత్తకుండా చూచుకోవాలి. మీ స్నేహితునితో సత్సంబంధాలను నిల్పుకోవటం కోసం మీరు ఇంట్లో సమస్యలు సృష్టించుకొంటారు. అది పద్ధతి కాదు. అందువల్ల ముందుగా ఆమె చెప్పినట్లయితే మీరు తప్పక ఎడ్జస్ట్ కావాలి.

ప్రశ్నకర్త : ఒక వేళ అతను రాత్రి 8 గంటలకు ఏదైనా అర్జంట్ మీటింగ్‌కి వెళ్లవలసి వుండగా భార్య నిద్రపొమ్మని నిర్బంధిస్తే అతడు ఏం చేయాలి?

దాదాశ్రీ : మీరిలా ఊహాగానాలు చేయరాదు. ప్రకృతి నియమం ఏమంటే “మనసుంటే మార్గం ఉంటుంది.” మీరీ విధంగా ఊహాగానం ప్రారంభిస్తే, అదే విషయాలను చెడగొడ్తుంది. అంతకు ముందు రోజు ఆమె స్వయంగా మిమ్మల్ని వెళ్లమని ప్రోత్సహిస్తూ ఉన్నది. ఆమె మీతో పాటు కారువరకు నడచి వచ్చింది కూడ. ఇటువంటి ఊహలవల్ల ప్రతిపని సర్వనాశనమౌతుంది. నీకు అర్థమైందా? ఎడ్జస్ట్ అవ్వాలనే ఉపదేశాన్ని పాటిస్తావా?

ప్రశ్నకర్త : పాటిస్తాను.

దాదాశ్రీ : మంచిది, అయితే నాకు వాగ్దానం చెయ్యండి.

ప్రశ్నకర్త : అవును దాదా! నేను వాగ్దానం చేస్తున్నాను.

దాదాశ్రీ : వాగ్దానం చేసావు. చాలా గొప్ప విషయం. దీనినే వీరత్వం అంటారు.

## భోజన సమయంలో సర్దుబాటు

ఆదర్శపూర్వక దైనందిన జీవిత వ్యవహారం అనగా ప్రతి సమయంలోనూ సర్దుకొని పోవటమే. మీ ఆధ్యాత్మికోన్నతి కోసం ఈ అమూల్య సమయాన్ని వినియోగించాలి. అభిప్రాయ భేదాలను సృష్టించుకోవద్దు. అందుకోసం నేను మీకు ఈ సూత్రాన్ని యిస్తున్నాను. "ఎడ్జస్ట్ ఎవ్విరివేర్"! ఎడ్జస్ట్! ఎడ్జస్ట్! ఎడ్జస్ట్! కడీలో (మజ్జిగతో చేసిన వేడి సూప్) ఉప్పు చాలా ఎక్కువైతే ఎడ్జస్ట్ కావటం గురించి దాదాజీ ఏమి చెప్పారో మీరు గుర్తు తెచ్చుకోవాలి. ఆ పదార్ధాన్ని కొంచెంగా తినండి. అవసరమైతే ఏదైనా పచ్చడి వడ్డించమని అడగండి, కానీ వివాదపడవద్దు. యింట్లో ఏ విధమైన ఘర్షణలు ఉండకూడదు. సర్దుబాటు జీవితంలోని విపత్కర సమయాలలో సమన్వయాన్ని, సహజీవనాన్ని సమకూరుస్తుంది.

## నీకు అదియిష్టం లేకున్నా, ఏదోవిధంగా స్వీకరించు,

ఎవరు నీతో అననుకూలంగా ఉంటారో ఆవ్యక్తితోనే నీవు ఎడ్జస్టుకావాలి. దైనందిన జీవితంలో అత్తాకోడళ్ళ మధ్య అననుకూలతలు, అభిప్రాయ భేదాలు ఏర్పడినచో ఈ దుర్గమ సంసార చక్రంనుంచి ఎవరు బయటపడాలనుకొంటారో వారే ఎడ్జస్ట్ కావాలి. భార్య,భర్తల మధ్య కూడ ఒకరు వస్తువులను చిందరవందర చేస్తుంటే రెండవవారు సరి చేయాలి. బాంధవ్యము శాంతి పూర్వకంగా నిలిచి ఉండాలంటే ఇది ఒక్కటే మార్గము. ఒకరు ఉద్రేకపూరితులైనప్పుడు రెండవవారు మౌనం వహించాలి.

ఎలా ఎడ్జస్ట్ కావాలో మీకు తెలియకపోతే మిమ్మల్ని ప్రజలు పిచ్చి వారుగా పరిగణిస్తారు. ఈ అశాశ్వతమైన జగత్తులో మీరు చెప్పినదే సత్యమని, అదే జరగాలని పట్టుబట్టవలసిన అవసరం లేదు. ఒక దొంగతో కూడ మీరు ఎడ్జస్ట్ కాగలిగి ఉండాలి.

## ఆమెను సరిదిద్దటమా లేక ఆమెతో ఎడ్జస్ట్ కావటమా?

ప్రతి సందర్భంలోను మీరు ఎదుటివ్యక్తితో ఎడ్జస్ట్ అయినచో జీవితం ఎంతో అందంగా వుంటుంది. మన మరణ సమయంలో మనం వెంట ఏమి తీసికొని వెళ్తాం? "నేను ఆమెను సరిచేస్తాను" అని భర్త భార్య గురించి మాట్లాడుతాడు. నీవు గనుక ఆమెను తిన్నగా చేయ ప్రయత్నిస్తే నీవే స్వయంగా వంకర అవుతావు. నీ భార్యని

బాగుచేయటానికి ప్రయత్నించకు. ఆమెను ఉన్న దానిని ఉన్నట్లుగానే స్వీకరించు. జన్మ జన్మలకీ ఆమెతో నీకు శాశ్వత బాంధవ్యం ఉంటుందన్న గ్యారంటీ ఉంటే అది వేరే విషయం. ఆమె తన మరుజన్మలో ఎక్కడుంటుందో ఎవరికి తెలుసు? మీ ఇరువురి మరణం వేర్వేరు సమయాలలో జరుగుతుంది. అలాగే ఎవరి కర్మలు వారివి, అవి కూడ వేర్వేరుగానే వుంటాయి. ~~ఈ~~ జన్మలో ఆమెను నువ్వు సరిదిద్దాలని యత్నించినప్పటికీ ఆమె మరు జన్మలో ఇంకొకరి భార్య అవుతుంది.

అందువల్ల ఆమెను బాగుపరిచే ప్రయత్నం చెయ్యకు. ఆమె కూడ నిన్ను సరిచెయ్యాలని యత్నించకూడదు. ఆమె ఎలా ఉన్నప్పటికీ బంగారం అంత మంచిదని భావించు. నీవెంత గట్టి ప్రయత్నం చేసినప్పటికీ ఇంకొకరి ప్రకృతిని (స్వాభావిక లక్షణాలను) సరిచేయలేవు. కుక్క తోకను తిన్నగా చెయ్యాలని నువ్వెంతగా శ్రమించినా, అది వంకరగానే వుంటుంది. అందువల్ల నీవు జాగ్రత్తగా ఉంటూ ఆమెను ఎలా ఉన్నదో అలాగే వుండనివ్వు. సర్వత్ర సర్దుకొనిపో.

## భార్య ఒక ప్రతితూనిక

ప్రశ్నకర్త : నేను నా భార్యతో ఎడ్జస్ట్ కావటానికి నిజంగా ఎంతో యత్నిస్తాను. కానీ అలా కాలేకపోతున్నాను.

దాదాశ్రీ : ప్రతిదీ గత ఖాతాల ననుసరించి వుంటుంది. ఇది నట్స్ మరియు బోల్ట్స్ వంటి సాధారణ విషయం. నట్ మరియు బోల్ట్ ఒకదానికొకటి తగిన విధంగా జతకుదరాలి. మరలతో కూడిన బోల్ట్‌కి సాదా నట్‌ని అమర్చడము వీలు కాదు. నీవిలా తలుస్తుండవచ్చు, “స్త్రీలెందుకు యిలా ఉంటారు?” స్త్రీలు మీ యొక్క ప్రతి తూనిక. (త్రాసు యొక్క ఒక పళ్ళెంలో గుండు, రెండవ పళ్ళెంలో పదార్థం ఉంటుంది. అవి ఒకదాని కొకటి ప్రతి తూనిక. లేకుంటే ఒకవైపు మాత్రమే భారమై క్రిందకు పడిపోతుంది.) వారు మీకు సహాయకారులు. ఆమె మొండితనం నీస్వంతతప్పులకు సరిపాళ్ళలో ఉంటుంది. ప్రతిదీ వ్యవస్థిత్ (సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్) అని నేను దీనిని చూచి మరీ చెప్తున్నాను.

ప్రశ్నకర్త : ప్రతి ఒక్కరూ నన్ను సరిచేయటానికే వచ్చినట్లుగా అన్పిస్తుంది.

దాదాశ్రీ : నీవు తప్పనిసరిగా సరికావలసిందే, లేకుంటే నీ ప్రపంచం ఎలా నడుస్తుంది? నీవు బాగుపడనిచో మంచి తండ్రివి ఎలా కాగలవు? మారకపోవటం

స్త్రీజాతి సహజలక్షణం, కనుక నీవే మారవలసి వున్నది. స్త్రీల స్వాభావిక ప్రకృతి వారిని ఎడ్జస్ట్ కాకుండా నిరోధిస్తుంది. వారు మార్పు చెందటం అంత తేలిక కాదు.

భార్య అంటే ఏమిటి?

ప్రశ్నకర్త : మీరే చెప్పండి దాదాజీ.

దాదాశ్రీ : భార్య పురుషుని యొక్క ప్రతితూనిక (కౌంటర్ వెయిట్). ఆ ప్రతి తూనిక లేకుంటే పురుషుడు క్రింద పడతాడు.

ప్రశ్నకర్త : నాకు అర్థం కాలేదు. దయతో వివరించండి.

దాదాశ్రీ : ఇంజన్లలో కౌంటర్ వెయిట్స్‌ని స్థాపించటం జరుగుతున్నది. ఈ కౌంటర్ వెయిట్స్ లేకుంటే ఇంజన్ ఫెయిల్ అవుతుంది. అదే విధంగా స్త్రీలు పురుషుని యొక్క కౌంటర్ వెయిట్. భర్తను స్థిరపర్చడానికి భార్య లేనిచో అతడు పడిపోతాడు. అతడు లక్ష్యరహితంగా ప్రతిచోటా తిరుగుతుంటాడు. స్త్రీ కారణంగా అతడింటికి వస్తాడు. లేనిచో వస్తాడా?

ప్రశ్నకర్త : రాడు.

దాదాశ్రీ : ఆమె అతని కౌంటర్ వెయిట్.

## ఘర్షణలు అన్నీ చివరికి ముగింపుకొస్తాయి.

ప్రశ్నకర్త : ఉదయం జరిగిన ఘర్షణని మేము మధ్యాహ్నానికంతా మర్చిపోతాం, కానీ సాయంత్రం వేరొక కొత్త ఘర్షణ తలెత్తుతుంది.

దాదాశ్రీ : ఈ సంఘర్షణల వెనుక పనిచేసే శక్తి ఏదో నాకు తెలుసు. ఏ శక్తి ప్రభావంతో ఆమె తర్కిస్తుంటుందో నాకు తెలుసు. ప్రజలు ఘర్షణ పడిన తర్వాత ఎడ్జస్ట్ అవుతారు, దీనినంతటిని మీరు జ్ఞానంద్వారా గ్రహించవచ్చు. మీరు ప్రపంచంలో తప్పనిసరిగా ఎడ్జస్ట్‌కావాలి. కారణమేమంటే ప్రతి సంఘటనా అంతం అయ్యేదే, అది క్రమంగా ముగిసిపోతుంది. ఘర్షణ ఏదైనా కొనసాగుతూనే ఉంటే, దానిలో తగుల్కొన్న ప్రతి ఒక్కరూ బాధపడవలసి వుంటుంది. మిమ్మల్ని మీరు గాయపరుచుకొని, ఇతరులను గాయపరుస్తారు.

## ప్రార్థన ద్వారా సర్దుబాటు

ప్రశ్నకర్త : ఎదుటివ్యక్తికి తెలియజెప్పటం కోసం నేనెంతగానో ప్రయత్నించాను. ఆ తర్వాత దానిని గ్రహించటం, గ్రహించకపోవటం అతనికే వదలిపెట్టాలా?

దాదాశ్రీ : అతనికి విషయాన్ని వివరించటం నీ బాధ్యత. అయినా అతను గ్రహించకుంటే దానికి పరిష్కారం లేదు. అపుడు మీరు ఇలా చెప్పాల్సి వుంటుంది: (ఆ వ్యక్తిలోని పరమాత్మనుద్దేశించి) "దాదా భగవాన్! అతనికి అర్ధం చేసుకోగల సద్బుద్ధిని ప్రసాదించు.'' ఇంత మాత్రమైనా మీరు చేయాలి. మీరతనిని నిర్లక్ష్యంగా వదిలివేయలేరు. ఇది అపాయకరం. ఇది దాదాజీ యొక్క అమూల్యమైన ఎడ్జస్ట్‌మెంట్ విజ్ఞానం. ఎడ్జస్ట్ కాలేని మీ అశక్తత వల్ల కలిగే ఫలితాలను మీరు తప్పక అనుభవిస్తూ ఉండి ఉంటారు. ప్రతికూలత (డిజడ్జస్ట్‌మెంట్) మూర్ఖత్వం. భర్తగా తన అధికారాన్ని వదులుకోలేనని, తనమాటే చెల్లుబాటు కావాలని ఒకడు తలచినచో అతడు తన గొయ్యి తానే తవ్వుకొన్నవాడవుతాడు. అతని జీవితం దు:ఖకరమౌతుంది. విషయాలను వాటి దారిలో వాటిని నడవనివ్వండి. నీ భార్య "నువ్వు మందమతివి'' అన్నట్లయితే నీవు సమాధానం యిలా చెప్పాలి "నీవు నిజమే చెప్పావు.''

## సంక్లిష్టమైన ప్రజలతో ఎడ్జస్ట్ కావాలి.

ప్రశ్నకర్త : సర్దుబాట్లు ఏకపక్షంగా ఉంటే ఈ ప్రపంచంలో కుదరదు. నిజమేనా?

దాదాశ్రీ : ఆదర్శప్రాయమైన ప్రాపంచిక జీవనానికి నిర్వచనం సర్దుబాటు. ఇరుగుపొరుగు వారు కూడ సర్దుబాటుగల కుటుంబాన్ని గుర్తించి "ఈ ఇల్లు తప్ప ప్రతి యింట్లోను ఘర్షణ వుంది'' అని చెప్తారు. మీరు ఎవరితో కలిసిమెలిసి ఉండటం లేదో ప్రత్యేకంగా వారితో కలిసిపోయేలా మీశక్తులను పెంపొందించుకోవాలి. మీరు ఎవరితో కలవగల్గుతున్నారో వారి విషయంలో ఈ శక్తులు మీకిప్పటికే ఉన్నాయి. ఎడ్జస్ట్ కాలేక పోవటం బలహీనత. ప్రతి ఒక్కరితో అనుకూలంగా ఉండటం నాకెలా సాధ్యమైంది? ఎంత ఎక్కువగా ఎడ్జస్ట్ అయితే అంత ఎక్కువగా మీ శక్తులు వృద్ధి పొందుతాయి, బలహీనతలు తగ్గిపోతాయి. మిథ్యాజ్ఞానము నాశనము చేయబడితే యదార్ధజ్ఞానము వ్యాప్తిలో ఉంటుంది.

మృదుస్వభావం గలవారితో ఎవరైనా ఎడ్జస్ట్ అవుతారు. కాని కఠినమైన మూర్ఖపు పట్టుదలగల, నిర్దయులైన వారితో ఎడ్జస్ట్ అవ్వటం నేర్చుకొంటే మీరు నిజంగా కొంతైనా సాధించినట్లు. ఒక వ్యక్తి ఎంత అవమానకరమైనవాడు, సిగ్గుమాలిన వాడైనప్పటికీ మీ మనసు కలతపడని రీతిలో మీరు అతనితో ఎడ్జస్ట్ కాగలిగితే అది ఎంతో విలువైనది. ప్రపంచంలో ఏదీ మీకు ఫిట్ కాదు (అనుకూలంగా ఉండదు.) మీరే దానిలో ఫిట్ అయితే ప్రపంచం సుందరంగా ఉంటుంది. కానీ మీరు దానిని మీకు ఫిట్ అయ్యేలా చెయ్యాలని ప్రయత్నిస్తే అది వికృతమౌతుంది. అందరితో, అన్నివేళలా సర్దుకొని పోవాలి. మీరు ప్రపంచంలో ఎడ్జస్ట్ అయినంతకాలం ఏ సమస్యలూ ఉండవు.

## న్యాయానికై చూడకు, కేవలం సెటిల్ చేసుకో

ఎడ్జస్ట్ అవ్వటానికి నిరాకరించే వ్యక్తితో కూడ జ్ఞాని ఎడ్జస్ట్ అవుతాడు. జ్ఞాని పురుషుని గమనించినచో అన్ని విధాలుగా సర్దుబాట్లు చేసికోవటం మీరు నేర్చుకోగలరు. ఈ జ్ఞానం వెనుకవున్న సైన్సు మీరు వీతరాగులు కావటానికి సహాయపడ్తుంది. అనగా రాగద్వేషాలనుంచి మీరు స్వేచ్ఛను పొందుతారు. మీలోపల ఇంకను జీవించివున్న రాగము లేక ద్వేషము మీ బాధలకు కారణము. మీరు మీ ప్రాపంచిక వ్యవహారాలలో తటస్థంగా, ఉదాసీనంగా మారినచో లోకం మిమ్మల్ని అనర్హులుగా పేర్కొంటుంది. మొండివారిని, భేదాభిప్రాయము గలవారిని కూడ మీరు సమాధానపర్చగలగాలి. మనకు రైల్వే స్టేషనులో కూలీ అవసరమున్నప్పుడు, అతను ధర విషయంలో స్వల్పమైన భేదానికి పట్టుబడితే కొంత ఎక్కువ మూల్యానికైనా వ్యవహారాన్ని సెటిల్ చేసికోవాలి. అలా కానిచో మనమే స్వయంగా లగేజ్‌ని మోసుకొనవలసి వస్తుంది.

న్యాయాలను చూడవద్దు. దయచేసి సెటిల్ చేసుకోండి. ఎదుటి వ్యక్తిని సమాధానపడమని చెప్పే సమయం ఎక్కడిది? ఎదుటి వ్యక్తి నూరు తప్పులు చేసినా వాటిని మీ తప్పులుగానే భావించి ముందుకు సాగిపోవాలి. ఈ కాలంలో న్యాయంకోసం ఎక్కడని వెదకాలి? ఈ కాలం దోషభూయిష్టమైంది. అంతటా అస్థవ్యస్థత నెలకొని వుంది. ప్రజలు కలవరపాటుకు గురౌతున్నారు. ఇంటికి వెళ్తే భార్య అతనిపై కేకలు వేస్తుంది. అతని పిల్లలు ఫిర్యాదు చేస్తారు. ఆఫీసులో పై అధికారి అతనిపై అధికారం చలాయిస్తాడు. ఆఫీసుకు చేరేలోపు రైలులో ప్రజల తొక్కిసలాట. ఎక్కడా శాంతిలేదు. ప్రతి ఒక్కరికీ శాంతి కావాలి. ఎవరైనా కలహానికి దిగితే మనకి అతనిపై దయ కలగాలి

మరియు ఇలా ఆలోచించాలి "అయ్యో! అతనికి ఎంతో మనస్తాపం కల్గి ఉంటుంది. కనుకనే అతడు కలహిస్తున్నాడు." ఎవరు కలతచెందుతారో వారు బలహీనులు.

## నిందించవద్దు, సర్దుకో

ఇంటివద్ద ఎలా ఎడ్జస్ట్‌కావాలో ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. మీరు సత్సంగం నుంచి ఇంటికి ఆలస్యంగా వెళ్తే ఆమె ఏమంటుంది? "మీకు సమయ స్పృహ ఉండాలి. కొంచెం ముందుగా ఇంటికి వస్తే తప్పేమిటి?"

పొలంలో ఎద్దుని ఎలా తోలతారో ఎపుడైనా మీరు చూశారా? ఎపుడైనా ఎద్దు కదలకపోతే ములుగర్రతో పొడుస్తారు. కానీ అది కదులుతుంటే దానిని కొట్టరు. మూగ జంతువు ఏమి చేస్తుంది? అది ఎవ్వరికి ఫిర్యాదు చెయ్యగలదు? ఒక వ్యక్తి ఎవరినైనా బాధిస్తుంటే మిగిలినవారు అతనిని రక్షించడానికి వస్తారు. కానీ పాపం ఆజంతువు ఎవరికి చెప్పుకోగలదు? ఇదే విధంగా ఒక భర్త ఎందుకు బాధపడాలి? అది అతని గతజన్మ కర్మలఫలం. తన గతజన్మలో అతడు ఇతరులను చాలా నిందించాడు. ఎద్దును ములుగర్రతో పొడిచే మనిషిలా అతడు ఆ సమయంలో అధికారంలో ఉన్నాడు. ఇపుడతనికి అధికారం లేదు కనుక ఫిర్యాదులు లేకుండా ఎడ్జస్ట్ కావాలి. కనుక ఈ జన్మలో "ప్లస్ - మైనస్" చేయి (గత ఖాతాలను సెటిల్ చేసికోవటానికి దాదాజీ ఉపయోగించే పదం "ప్లస్ - మైనస్").

ఎవరినీ ఏ మాత్రం నిందించకుండా ఉండటం చాలా మంచిది. నీవు నేరం మోపేవానిగా మారితే నీపై నేరం మోపబడుతుంది. ఒకరిపై మనం నేరం మోపనూవద్దు, మనం నేరాన్ని మోయానూవద్దు. ఎవరైనా మిమ్మల్ని అవమానిస్తే దానిని స్వీకరించండి. దానిని మీ ఖాతాకి క్రెడిట్ చేసుకోండి. దీని గురించి మీరేమి అనుకుంటున్నారు? నేరం మోపటం మంచిపనేనా? దీని బదులు మొదటినుంచే ఎందుకు ఎడ్జస్ట్ కాకూడదు?

## తప్పుగా మాట్లాడినందుకు పరిహారం

దైనందిన జీవిత వ్యవహారాలలో ఎడ్జస్ట్‌మెంట్‌ని ఈ కాలంలో జ్ఞానంగా చెప్పవచ్చు. సర్దుకొని పొండి. మీరు ఎడ్జస్ట్ కావాలని ప్రయత్నించి విఫల మయ్యారనుకోండి. మరల ఎడ్జస్ట్ కండి. ఉదాహరణకి మీరు ఒకరిని గాయపరిచేవిధంగా ఏదో మాట్లాడారు. ఆ పని మీ నియంత్రణలో లేకుండా జరిగిపోయింది. తర్వాత మీ తప్పుని మీరు

గ్రహించారు. సాధారణంగా ఈ పరిస్థితిలో మీరు ఎడ్జస్ట్ అవ్వరు. ఇకమీదట చేసిన తప్పుకు క్షమాపణ అడిగే విధంగా ఎడ్జస్ట్ అవ్వాలని మీరు దృఢంగా నిర్ణయించుకోండి. ఇలా చెప్పండి "డియర్ ఫ్రెండ్, నా తప్పుకి నన్ను క్షమించు. నా మాటలతో అపుడు నిన్ను గాయపరిచాను.'' ఇది ఎడ్జస్ట్‌మెంట్. ఈ విధంగా చేయటానికి నీకేమైనా అభ్యంతరమా?

ప్రశ్నకర్త : ఏమాత్రం లేదు.

## ప్రతిచోట ఎడ్జస్ట్ కావాలి

ప్రశ్నకర్త : చాలా సార్లు, ఒకే సమయంలో ఒకే విషయానికి సంబంధించి ఇద్దరు వ్యక్తులతో మనం ఎడ్జస్ట్ కావలసి వుంటుంది. ఒకేసారి ఇద్దర్ని ఎలా సమాధానపరచగలం?

దాదాశ్రీ : మీరు యిద్దరినీ సమాధానపరచగలరు. ఒక వేళ మీరు ఏడుగురితో ఎడ్జస్ట్ కావలసి వచ్చినప్పటికీ దానిని మీరు చేయగలరు. ఒకరు మిమ్మల్ని "నా కోసం నువ్వేమి చేసావు?'' అని అడిగినచో మీ సమాధానం ఇలా వుండాలి: "అవును. నువ్వు నన్నేమి చేయమంటే అది చేస్తాను.'' ఇంకొక వ్యక్తికి కూడ ఇదే విధంగా చెప్పు. వ్యవస్థిత్‌లో లేనిది ఏమీ జరగదు. సంఘర్షణలను సృష్టించవద్దు. సర్దుబాటే తాళం చెవి. "అవును'' అనటం వల్ల ముక్తి లభిస్తుంది. మీరు 'అలాగే' అని ఏడుగురికి చెప్పటం వల్ల వ్యవస్థిత్‌లో లేనిది ఏమైనా జరగబోతుందా? మీరు ఏ ఒక్కరికైనా 'కాదు' అని చెప్తే సమస్యలొస్తాయి.

భార్యాభర్తలిరువురూ కలిసి సర్దుకొనిపోవాలని గట్టిగా నిర్ణయించుకొంటే వారికి పరిష్కారం లభిస్తుంది. ఒకరు మొండికేస్తే రెండవవారు దానిని మన్నించటం ద్వారా సర్దుకొని పోవాలి.

నీవు ఎడ్జస్ట్ కాకుంటే పిచ్చివాడివి కాగలవు. అదే పనిగా ఇతరులను బాధించటం ఈ పిచ్చికి హేతువవుతుంది. మీరు ఒక కుక్కని ఒకటి, రెండు లేక మూడు సార్లు ఉద్రేకపరిచినచో అప్పటికీ అది గమనించి ఊరుకొంటుంది. కానీ అదే పనిగా మీరు దానిని పీడిస్తూ ఉంటే అది మిమ్మల్ని కరుస్తుంది. కుక్క కూడ మిమ్మల్ని చెడ్డ వ్యక్తిగా తలుస్తుంది. ఇది గ్రహించవలసిన విషయం. ఎవరినీ రెచ్చగొట్టవద్దు. ప్రతి చోట సర్దుకొనిపొండి.

సర్దుబాటు అనే కళను ఎవరైతే నెర్చుకొన్నారో వారు శాశ్వతానందానికి మార్గాన్ని కనుగొన్నారు. సర్దుబాటు చేసికోవటమే జ్ఞానము. సర్దుబాటును నేర్చుకుంటే విజయాన్ని సాధించినట్లే. మీకు ఎదురైన బాధలు ఏమైనాకానీ అనుభవించవలసిందే, కానీ సర్దుకొనిపోవటం నేర్చుకొన్న వ్యక్తికి ఏ సమస్యలూ ఉండవు. పాత ఖాతాలు పూర్తయిపోతాయి. ఒకవేళ దారిలో నీకెపుడైనా బందిపోటు కలిసినట్లయితే నీవు అతనికి ప్రతికూలంగా వ్యవహరిస్తే (డిజడ్జస్ట్ అయితే) అతను నిన్ను కొడతాడు. దానికి బదులు నీవు ఎడ్జస్ట్ అయ్యి "ఫ్రెండ్, నీకేమి కావాలి? నేను తీర్థయాత్రలకై వెళ్తున్నాను. నా వద్ద ఎక్కువ డబ్బులేదు.'' అని చెప్పి నీ పని పూర్తిచేసికోవాలి. ఈ పని చేయటం వల్ల నీవతనికి అడ్జస్ట్ అయ్యావు.

నీ భార్యవంటను నీవు విమర్శించినచో నీవు ఘోరమైన తప్పు చేసినట్లే. ఆపని చేయకూడదు. నీవు  ఎన్నడూ ఏ పొరపాటూ చేయనట్లు మాట్లాడుతుంటావు. నీజీవితాన్ని ఎవరితో గడపాలని నిర్ణయించుకొన్నావో ఆవ్యక్తితో నీవు తప్పక ఎడ్జస్ట్ కావాలి. నీవెవరినైనా గాయ పర్చినచో మహావీర్ భగవాన్ ధర్మాన్ని అనుసరిస్తున్నానని నిన్ను నీవెలా చెప్పుకోగలవు? ఇంట్లో ఏ ఒక్కరికీ దుఃఖం కలుగకూడదు. ఇది చాలా ముఖ్యమైన విషయం.

## ఇల్లు ఒక పూల తోట

ఒక వ్యక్తి నాతో యిలా చెప్పనారంభించాడు "దాదా, నా భార్య అలా చేస్తుంది. ఇలా చేస్తుంది. ఆమెతో కలిసి జీవించటం కష్టం.''

అతని గురించి అతని భార్య ఏమంటుందని నేనతనిని అడిగాను. అతను, తన భార్య తనకు వివేకం లేదని అంటుందని చెప్పాడు. నీవు నీ వైపు మాత్రమే న్యాయానికై ఎందుకు వెతుకుతున్నావు? అతడు తన యిల్లు నాశనమైపోయిందని, భార్య, పిల్లలు పాడైపోయారని చెప్పసాగాడు. ఏమీ నాశనం కాలేదని, వారిని అర్థం చేసుకోవటం అతనికి తెలియలేదని నేనతనికి చెప్పాను. ఇంట్లో ప్రతి ఒక్కరినీ అర్థం చేసికోవటం నేర్చుకోవాలని వారి ప్రకృతిని గుర్తించాలని నేనతనికి చెప్పాను.

సర్దుబాటు చేసికోలేకపోవటానికి కారణం ఏమిటి? మీ కుటుంబం పెద్దది. చాలామంది సభ్యులున్నారు. అందరితో సమాధాన పడటం కష్టంగా ఉంటుంది. అందరి ప్రకృతి ఒకే విధంగా ఉండదు. ప్రజల ప్రకృతి ప్రస్తుత కాలానుగుణంగా వుంటుంది.

సత్యయుగంలో ప్రతి ఒక్కరూ ఐకమత్యంతో జీవించారు. ఒక యింట్లో ఒక వందమంది నివసించినప్పటికీ అందరూ కుటుంబ పెద్దను గౌరవించి విధేయులై ఉండేవారు. ఈ కలియుగంలో కుటుంబ పెద్ద మాటను వినరు, అతని హక్కును సవాలు చేస్తారు, ఎదిరిస్తారు, అతడిని నిందిస్తారు కూడ.

ప్రతి ఒక్కరూ మనిషే కాని దీనిని గుర్తించటం ఎలాగో నీకు తెలియదు. ఇంట్లో ఒక యాభైమంది సభ్యులుండవచ్చు కానీ మీరు వారి ప్రకృతిని గుర్తించనందువల్లనే వివాదాలు తెలెత్తుతాయి. వారిలోని భేదాలను మీరు గుర్తించవలసి ఉన్నది. ఇంట్లో ఒక వ్యక్తి రోజంతా సణుగుతున్నట్లయితే, అది అతని ప్రకృతి. ఒకసారి మీరీనిజాన్ని గుర్తిస్తే ఆపై మీరేమీ చేయవలసిన అవసరం లేదు. మీరతనిని ఇంకా నిశితంగా పరిశీలించవలసిన అవసరం లేదు.

కొంతమందికి ఆలస్యంగా నిద్రించే అలవాటుంటుంది, మరికొందరు త్వరగా నిద్రిస్తారు. వారెలా కలిసి ఉండగలరు? వారంతా ఒకే కప్పు క్రింద ఒక కుటుంబంగా కలిసి జీవిస్తే ఏమవుతుంది? ఇంట్లో ఎవరైనా నిన్ను "నువ్వు బుద్ధి హీనుడివి" అనవచ్చు. ఆ సమయంలో నీవు తెలిసికొనవలసినదేమంటే ఆవ్యక్తి కేవలం అటువంటి భాషనే ఉపయోగిస్తాడని. అతనిని తిరిగి అవమానిస్తే నీవు అలసిపోతావు, ఘర్షణ కొనసాగుతుంది. ఆ మనిషి నిన్ను గుద్దుకొన్నాడు, కానీ నీవు కూడ అతనిని ఢీకొంటే నీవు కూడ గ్రుడ్డివాడివేనని ఋజువవుతుంది. మనుష్యుల యొక్క ప్రకృతిలోని ఈ భేదాలను అర్థం చేసుకోమని నేను నీకు చెప్తున్నాను.

## ఉద్యానవనంలోని పూలయొక్క విభిన్న రంగులు, పరిమళాలు

మీ యిల్లు ఒక ఉద్యానవనం. సత్య, ద్వాపర, త్రేతాయుగాలలో ఇళ్ళు పొలాలవలె ఉండేవి. ఒక పొలంలో పూర్తిగా గులాబీలు మాత్రమే ఉండేవి, వేరే పొలంలో కేవలం లిల్లి పూలు వుండేవి. ఈ రోజుల్లో ఇళ్ళు ఉద్యానవనంలా తయారయ్యాయి, రకరకాల పువ్వులు అక్కడ కనిపిస్తాయి. ఏ మొక్కా ఇంకొక దానిని పోలి వుండదు. ఒక పువ్వు గులాబీ అయ్యిందీ, మల్లె అయ్యిందీ మనం పరీక్షించుకోవద్దా? సత్యయుగంలో ఒక ఇంట్లో ఒకరు గులాబీ అయితే, మిగిలినవారంతా గులాబీలే అయి వుండేవారు. ఇంకోయింట్లో ఒకరు మల్లె అయితే ఇంట్లోని వారంతా మల్లెలే అయి ఉండేవారు. పొలంలో ఒకేరకం మొక్కలున్నట్లుగా ఇంట్లోని వారంతా ఒకే విధంగా వుంటే ఏ

సమస్యాలేదు. కానీ ఈ రోజుల్లో ఈ యిళ్ళు ఉద్యానవనాలయ్యాయి. ఒకే యింట్లో ఒకరు గులాబీ అయితే, మరొకరు మల్లె. గులాబీ మల్లెతో "నీవు నా వలె ఎందుకు లేవు? నీ వెలా తెల్లగా ఉన్నావో చూడు మరి నా మనోహరమైన రంగుని చూడు." "నీకు అంతా ముళ్ళు ఉన్నాయి" అని మల్లె సమాధానం. గులాబీకి ముళ్లుండటం సహజం. మల్లె అయితే తెల్లగా ఉండటం సహజం.

ఈ కలియుగంలో ఒక యింట్లో రకరకాల మొక్కలుంటున్నాయి. అది ఉద్యానవనంలా మారింది. ఎవరూ దీనిని చూడటం లేదు, అందువల్ల అది దు:ఖానికి దారి తీస్తుంది. ప్రపంచానికి ఈ విధమైన దృష్టి లేదు. ఎవరూ చెడ్డవారు కారు. అభిప్రాయ భేదాలకు కారణం అహంకారమే. నాకు అహంకారం లేదు కనుక ప్రపంచంతో నాకు ఘర్షణ లేదు. ఇది గులాబి, ఇది మల్లె, ఇది చంద్రకాంత పుష్పం మరియు ఇది కాకరపువ్వు అని నేను గుర్తించగలను. వీటినన్నిటిని నేను గుర్తించగలను. ఈ ఉద్యానవనాలు అభినందించదగినవి. నీవేమంటావు?

ప్రశ్నకర్త : మీరు చెప్పింది నిజమే.

దాదాశ్రీ : ప్రకృతి మారదు. దాని సహజ లక్షణాలు దాని కుంటాయి. అది అలాగే వుంటుంది. ప్రతి ఒక్కరి ప్రకృతిని నేను తెలుసుకోగలను. అర్ధం చేసుకోగలను. నేను ప్రకృతిని వెంటనే గుర్తిస్తాను. కనుక ప్రజలతో వారి ప్రకృతిననుసరించి వ్యవహరిస్తాను. మండు వేసవిలో మిట్ట మధ్యాహ్నం సూర్యునితో కలిసి ఆనందించాలని వెళ్తే నీవు బాధపడతావు. చలికాలం సూర్యుడు అంతతీవ్రముగా ఉండడు. నీవొక్కసారి సూర్యుని ప్రకృతిని తెలుసుకుంటే నీ పనులకై నీవు సర్దుబాటు చేసికోవచ్చు.

నేను ప్రకృతిని అర్ధం చేసికొంటాను, మీరు నాతో ఘర్షణకై ప్రయత్నించినా నేను దానినుండి వైదొలగుతాను. నేను దానికి అవకాశమివ్వను. లేకుంటే జగడంలో యిద్దరూ బాధపడతారు. అందువల్ల ఇంట్లో ప్రతి ఒక్కరి ప్రకృతిని గుర్తించు.

ఈ కలియుగంలో ప్రకృతులు పంటపొలంలా ఒకేలా వుండవు, అవి ఉద్యానవనంలా విభిన్నంగా ఉంటాయి. ఒకటి లిల్లి, ఇంకొకటి గులాబీ, మరొకటి మల్లె. ఆ పుష్పాలన్నీ జగడమాడుకుంటున్నందువల్ల అక్కడ వివాదాలు శాశ్వతంగా ఉంటాయి.

# కౌంటర్ పుల్లీ యొక్క ఇంద్రజాలం

మీరు ముందుగా మీ అభిప్రాయాన్ని వెల్లడించకూడదు. ఆ విషయంలో ఎదుటి వ్యక్తి ఏమనుకుంటున్నాడో అతనినే అడగాలి. ఒకవేళ ఆవ్యక్తి తన మాటనే మొండిగా పట్టుకొని వున్నచో, మీ అభిప్రాయాన్ని చెప్పవలసిన పనిలేదు. ఎదుటి వ్యక్తి ఏ విధంగానూ గాయపడకుండా ఉండేలా మీరు జాగ్రత్తపడాలి. మీ అభిప్రాయాన్ని ఎదుటి వారిపై రుద్దే ప్రయత్నం చేయవద్దు. ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని అంగీకరించాలి. నేను ప్రతి ఒక్కరి అభిప్రాయాన్ని స్వీకరించి జ్ఞానినయ్యాను. నేనెన్నడూ నా అభిప్రాయాన్ని ఇతరులపై రుద్దను. మీ అభిప్రాయం వల్ల ఎవరికీ దు:ఖం కలుగకూడదు.

మీ మానసిక భ్రమణం యొక్క వేగం నిమిషానికి 1800, ఎదుటి వ్యక్తి యొక్క మానసిక భ్రమణవేగం 600 అయినచో మీరు మీ అభిప్రాయాన్ని బలవంతంగా ఎదుటి వ్యక్తిపై రుద్దితే, అతని ఇంజను పాడైపోతుంది, అన్ని గేర్లు మార్చవలసి వస్తుంది.

ప్రశ్నకర్త : భ్రమణము (రివొల్యూషన్) అంటే అర్థం ఏమిటి?

దాదాశ్రీ : ఒక వ్యక్తి యొక్క ఆలోచనా వేగాన్ని భ్రమణము సూచిస్తుంది. ఇది వ్యక్తి వ్యక్తికీ మారుతుంది. ఒక సంఘటన ఒక నిమిషంలో మీకు ఎన్నో విషయాలను సూచిస్తుంది. ఒకేసారి ఆ సంఘటన యొక్క అన్ని దశలను మనోవేగం మీకు సూచిస్తుంది. ప్రెసిడెంట్ యొక్క భ్రమణం నిమిషానికి 1200, నాది 5000 మరియు మహావీర్ భగవాన్ యొక్క భ్రమణం నిమిషానికి 100,000.

ఈ ఘర్షణల వెనుకవున్న కారణం ఏమిటి? మీ భార్య యొక్క ఆలోచనావేగం 100, మీది 500. మీ ఆలోచనా వేగాన్ని తగ్గించటం కోసం కౌంటర్ పుల్లీని ఎలా ప్రయోగించాలో మీకు తెలియదు. ఇది వివాదాలకు, ఘర్షణలకు, జగడాలకు హేతువవుతుంది. ఒక్కోసారి ఇంజను మొత్తంగా చెడిపోతుంది.

రివొల్యూషన్ అంటే ఏమిటో అర్థమైందా? నీవు ఒక శ్రామికునితో మాట్లాడినట్లయితే నీవేమి చెప్పదలచుకొన్నదీ అతడు గ్రహించలేడు. ఎందువల్లనంటే అతని రివొల్యూషన్స్ 50, నీ రివొల్యూషన్స్ 500. ప్రజల యొక్క ఆలోచనా వేగము వారి అభివృద్ధి స్థాయిని బట్టి వుంటుంది. నీవు కౌంటర్ పుల్లీని లోనికి ప్రవేశపెట్టి నీ రివొల్యూషన్స్‌ని తగ్గించినపుడు మాత్రమే ఆ శ్రామికుడు నీవు చెప్పేదానిని గ్రహించగలుగుతాడు.

ప్రతి ఒక్కరి విషయంలోను నేను కౌంటర్ పుల్లీ ఉపయోగిస్తాను. అందువల్ల నాకెవరితోను ఘర్షణలుండవు. ఈ వ్యక్తి రివొల్యూషన్స్ ఇంతమాత్రమే అని నాకు తెలుసు. దాని ప్రకారం నేను కౌంటర్‌పుల్లీని ఎడ్జస్ట్ చేస్తాను. ఎదుటివ్యక్తి మిమ్మల్ని అర్ధం చేసుకోవాలంటే మీ అహంకారాన్ని తొలగించినంత మాత్రాన సరిపోదు,కౌంటర్ పుల్లీని కూడ తప్పక ఉపయోగించాలి. నేను చిన్నపిల్లలతో కూడ కలిసిపోతాను. ఎందువల్లనంటే నేను వారి విషయంలో కూడ కౌంటర్ పుల్లీని ఉపయోగిస్తాను. నేను అలా చేయనిచో వారి ఇంజన్ బ్రేక్ అవుతుంది.

ప్రశ్నకర్త : మనం ఎదుటివ్యక్తి స్థాయికి దిగి వచ్చినపుడే సంభాషణ అర్ధవంతంగా ఉంటుందని దీని భావమా?

దాదాశ్రీ : అవును. మీరు వారి స్థాయీ వేగానికి వచ్చినప్పుడు మాత్రమే మీ సందేశాన్ని వారికి అందించగలరు. మీకు కౌంటర్‌పుల్లీని ప్రయోగించటం తెలియకపోతే దానిలో తక్కువ రివొల్యూషన్స్ గల ఇంజను దోషం ఏమిటి?

## ఫ్యూజ్ వేయటం నేర్చుకో

మెషినరీ ఎలా పనిచేస్తుందో నీవు గుర్తించాలి అంతే. ఫ్యూజ్ ఎగిరిపోతే, నీవు తిరిగి ఎలా వేస్తావు? ఎదుటి వ్యక్తి యొక్క ప్రకృతితో ఎలా ఎడ్జస్ట్ కావాలో నీవు నేర్చుకోవాలి. ఎదుటివ్యక్తి ఫ్యూజ్ ఎగిరిపోయినప్పుడు కూడ నేను ఎడ్జస్ట్ అవుతాను. అతను ఇంకేమాత్రం ఎడ్జస్ట్ కాలేకపోతే ఏమి జరుగుతుంది? ఫ్యూజ్ పోయింది. అక్కడంతా అంధకారం, అతను గోడకో లేక తలుపుకో గుద్దుకుంటాడు. ఫ్యూజ్‌వైరు తెగిపోలేదు. ఎవరైనా ఫ్యూజ్‌ని వేసినట్లయితే అది మళ్లీ పనిచేస్తుంది. అప్పటివరకు అతను విఫలమవుతూనే వుంటాడు.

## చిన్న జీవితం: పెద్ద సమస్యలు

అన్నింటికంటే పెద్దదు:ఖం సర్దుబాటు లేకపోవటం (డిజడ్జస్ట్‌మెంట్) నుంచే వస్తుంది. ప్రతి చోట ఎందుకు సర్దుకొని పోకూడదు?

ప్రశ్నకర్త : దానికి ప్రయత్నం అవసరం.

దాదాశ్రీ : ఏ ప్రయత్నమూ అవసరం లేదు, నీవు నా ఆజ్ఞను పాటిస్తే చాలు "దాదా మనకి ప్రతిచోటా ఎడ్జస్ట్ అవ్వాలని చెప్పారు" అని గుర్తుంచుకుంటేచాలు. సర్దుబాటు అదే వస్తుంది. నీ భార్య నిన్ను 'దొంగ' అంటే, అపుడు నీవామెతో ఆమె చెప్పింది యదార్ధమేనని చెప్పాలి. ఒకవేళ ఆమె ఒక చీర కొనుక్కోవాలనుకుంటే ఆమె కోరినదానికంటే కొంచెం ఎక్కువ డబ్బు యివ్వు.

బ్రహ్మకి ఒకరోజు మన జీవితకాలానికి సమానం. బ్రహ్మకాలమానంతో పోలిస్తే మన జీవితకాలం ఒక్కరోజు. ఒక్కరోజు జీవితంకోసం ఈ కలహాలు అన్నీ దేనికి? బ్రహ్మకాలమానం ప్రకారం ఒక వంద సంవత్సరాలు మీరు జీవించవలసివుంటే "మేమెందుకు ఎడ్జస్ట్ కావాలి" అని తర్కించటం సముచితంగా ఉంటుంది, అపుడు మీరు మీవాదనలు ప్రారంభించవచ్చు. ఏమైనప్పటికీ, మీరు దీనిని త్వరగా ముగించగోరినచో ఏమి చేస్తారు? ఎడ్జస్ట్ అవుతారా లేక తిరిగి పోట్లాడతారా ? జీవితం చాలా చిన్నది. ప్రతి చోట ఎడ్జస్ట్ అవ్వటం ద్వారా మీ పనిని త్వరగా పూర్తిచేసుకోవలసి వుంది. మీ భార్యతో పోట్లాడినపుడు రాత్రి మీరు నిద్రపోగలరా? అదీ కాక, తెల్లవారిన తర్వాత మంచి ఉపాహారం మీకు లభిస్తుందా?

## జ్ఞానియొక్క కౌశలాన్ని ఆచరించండి.

ఒకరాత్రి భార్య తనకి క్రొత్త చీర కొనమని భర్తతో వాదిస్తుంది. అతడు ఆ చీర ఖరీదెంత అని అడుగగా ఆమె దానిమూల్యం 2200 రూపాయలు మాత్రమే అని చెప్తుంది. ఆ చీర 200 లేక 300 రు॥లు అయినచో తాను సంతోషంగా ఆమెకి కొని యిచ్చేవాడినని, అంత ఖరీదైన చీరను కొనే శక్తి తనకి ఎక్కడిదని భర్త చెప్పాడు. దానితో భార్య గొడవపడి మూతి ముడుచుకుంటుంది. ఎటువంటి సమస్య సృష్టింపబడింది? వివాహం చేసికోవటమే తప్పయిందని అతడు బాధపడటం మొదలు పెట్టాడు. జరిగిపోయినదానికి బాధపడి ప్రయోజనం ఏమిటి? ఇదే దు:ఖం.

ప్రశ్నకర్త : భర్త ఆమెకు 2200 రూపాయల చీర కొనిపెట్టాలని మీరు చెప్తున్నారా?

దాదాశ్రీ : దానిని కొనటం, కొనకపోవటం అతనిపై ఆధారపడి వుంది. ఆమె

ఆగ్రహపూర్వక వైఖరి కొనసాగుతుంది, ప్రతిరాత్రి ఆమె వంట చేయనని బెదిరిస్తుంది. అతను వేరే వంట మనిషిని ఎక్కడి నుంచి తెస్తాడు? అతను అప్పుచేసి అయినా సరే ఆ చీర కొనాల్సి వస్తుంది.

ఆమె తనంతట తానే చీర కొనటం విరమించుకొనేలా అతను పరిస్థితిని కల్పించాలి. అతని సంపాదన నెలకి 800 రూపాయలు అయితే అందులో 100 రూపాయలు అతని జేబు ఖర్చు నిమిత్తం ఉంచుకొని మిగిలిన మొత్తాన్ని ఆమెకివ్వాలి. అపుడామె ఆ చీరను కొనుక్కోగలదా? చీర కొనే విషయమై అపుడతడు ఆమెను ఆటపట్టించగలడు కూడ. ఇక చీర కొనే విషయంలో నిర్ణయం ఆమెదే. కానీ నిర్ణయం అతనిపైనే వుంటే ఆమె ఒత్తిడి చేస్తునే వుంటుంది. నేను జ్ఞానాన్ని పొందటానికి ముందే ఈ కళను నేర్చుకొన్నాను. ఆ తర్వాత చాలాకాలానికి నేను జ్ఞానిని అయ్యాను. క్లిష్ట పరిస్థితులలో వ్యవహరించవలసిన పద్ధతులను కనుగొన్న తర్వాతనే నేను జ్ఞానాన్ని పొందాను. మీకు ఈ కళ తెలియదు కనుకనే మీకు సమస్యలున్నాయి.

ప్రశ్నకర్త : అవును, అది నిజమే.

దాదాశ్రీ : తప్పంతా నీదేనని నీకు అర్థమైందా? ఈ కళను నీవు తప్పక నేర్చుకోవాలి.

## ఘర్షణలకు మూలకారణం అజ్ఞానం

దాదా శ్రీ : అజ్ఞానం వల్లనే ఘర్షణలు తలెత్తుతాయి. స్వస్వరూప జ్ఞానం, ప్రపంచ జ్ఞానం లేని కారణం గానే ఘర్షణలు చోటు చేసుకుంటాయి. ఈ ప్రపంచంలో ఏ ఒక్కరి ప్రకృతి ఇంకొకరి ప్రకృతితో కలవదు. జ్ఞానప్రాప్తికి ఒకే ఒక్క మార్గం ఉంది: ప్రతి చోటా సర్దుకొని పోవాలి (Adjust Everywhere). ఎవరైనా నిన్ను కొడితే, అతనితో నీవు ఎడ్జస్ట్ అవ్వాలి. నేను మీకు ఈ సరళమైన, తిన్ననిదారిని చూపిస్తున్నాను. ఈ ఘర్షణలు ప్రతిరోజూ సంభవించవు. మీ పూర్వ కర్మలు వాటి ఫలాలనివ్వటానికి సిద్ధంగా ఉన్నపుడు మాత్రమే ఘర్షణలు చోటు చేసుకుంటాయి. అవి ఏర్పడినపుడు సర్దుకొని పోవాలి. మీ భార్యతో జగడం జరిగితే తర్వాత ఆమెను బయటకు భోజనానికి తీసికెళ్ళి సంతోష పెట్టాలి. ఇకమీదట మీ బాంధవ్యంలో ఏ కలతలూ రాకూడదు.

ప్రపంచంలో ఏదీ మనకు అనుకూలంగా ఉండదు. కానీ మనమే దానికి అనుకూలంగా మారితే ప్రపంచం మనకి సుందరంగా కన్పిస్తుంది. ప్రపంచాన్ని మనకి అనుకూలంగా మార్చాలని ప్రయత్నిస్తే అపుడది వికృతమవుతుంది. అందువల్ల సర్వత్ర ఎడ్జస్ట్ కావాలి. ప్రపంచంలో మనం ఫిట్ అయితే సమస్యలుండవు.

## దాదాజీ ప్రతిచోట ఎడ్జస్ట్ అవుతారు.

ఒకరోజు కఢీ (మజ్జిగతో తయారు చేసే సూప్)లో ఉప్పు ఎక్కువైంది తప్ప బాగుంది. "దీనిలో ఉప్పు చాలా ఎక్కువగా ఉంది, కాని దానిని నేను కొద్ది కొద్ది మోతాదుల్లో చప్పరించగలను'' అని నాలో నేను అనుకొన్నాను. హీరాబా (దాదాజీ భార్య) లోనికి వెళ్లగానే నేను దానిలో కొద్దిగా నీళ్లు కలిపి పల్చన చేసాను. ఆమె అది చూచి నేను అలా చేయటానికి కారణం ఏమిటని అడిగింది. స్టౌ మీద ఉంచి ఆమె నీళ్లు కలపడానికి, డైనింగ్ టేబుల్‌పై నేను నీళ్లు కలపటానికి భేదం ఏమిటని అడిగాను. నీళ్లు కలిపిన తర్వాత తాను దానిని మరిగిస్తానని ఆమె చెప్పింది. నాకు రెండూ సమానమేనని భేదం లేదని చెప్పాను.

నీవు నన్ను మధ్యాహ్నభోజనం 11గంటలకు చేయమన్నప్పుడు నేను తర్వాత తింటానని చెప్తాను. అలా కాదు, త్వరగా భోజనం చేయమని, పాత్రలు శుభ్రం చేసుకోవాలని నీవు చెప్తే నేను ఎడ్జస్ట్ అయి వెంటనే భోజనానికి కూర్చుంటాను.

నీ ప్లేటులో ఏదివస్తే దానిని నీవు తినాలి. ఏది నీ ముందుకి వస్తుందో అది నీ ఖాతా. దానిని నీవు తిరస్కరిస్తే నీకే నష్టం అని భగవంతుడు చెప్పాడు. అందువల్ల నాకు అంతగా రుచించని పదార్థాలు నా పళ్లెంలో ఉన్నప్పటికీ, ఏదో విధంగా దానిలో కొంతైనా నేను తింటాను. ఆ విధంగా తినకపోతే రెండు విధాలుగా నేను సమస్యలను సృష్టించుకొన్నట్లవుతుంది. మొదట, వంట చేసి వడ్డించిన వ్యక్తి అవమానంగా భావించి గాయపడతారు. రెండవది, ఆ పదార్థాలు "నేనేమి తప్పుచేసాను? నేను నీకు సమర్పించబడ్డాను. నన్ను నీ వెందుకు అవమానిస్తున్నావు? నీ కెంత కావాలో అంతే తిను. కానీ దయచేసి నన్ను అవమానించకు'' అంటూ ఆక్షేపిస్తాయి.దానికి మనం కొంతైనా గౌరవం చూపవద్దా? ఎవరైనా నా కిష్టంలేని పదార్థాన్ని యిచ్చినప్పటికీ నేనతని

కోరికను మన్నిస్తాను. నీకు వడ్డించబడిన ఆహారం ఊరికే లభించలేదు, అందువల్ల దానిని గౌరవించాలి. నీవు దానిని విమర్శించి నందువల్ల నీ ఆనందం పెరుగుతుందా లేక తగ్గుతుందా? చాలా సార్లు నాకు వడ్డించబడిన కాయగూరలు నాకు యిష్టం ఉండవు, అయినప్పటికీ నేను వాటిని తింటాను, పైగా, వండిన వారిని అభినందిస్తాను.

నాకు తరచుగా చక్కెర లేని టీ అందేది. నేను ఏమీ అనను. అందువల్ల ప్రజలు "నీవేమీ చెప్పకపోతే, నీ భార్య ఈ విషయాలలో నిర్లక్ష్యంగా తయారవుతుంది" అనేవారు. నేను వారితో మర్నాడు ఏమి జరుగుతుందో వేచి చూడమని చెప్పేవాడిని. మరునాడు ఆమె "నిన్న టీ లో చక్కెర లేదు. నాకా విషయం మీరెందుకు చెప్పలేదు?" అనేది. "నేను నీకు చెప్పటం దేనికి? నీవు త్రాగినపుడు స్వయంగా తెల్సుకుంటావు కదా! నీవు టీ త్రాగకపోతే నేను చెప్పివుండే వాడిని. నీవు కూడ దానిని త్రాగుతావు, అందువల్ల నీకు చెప్పవలసిన అవసరం ఏముంది?" అని నేను అనేవాడిని.

ప్రశ్నకర్త : ఇలా సర్దుబాట్లు చేసికోవటానికి ప్రతి సెకండు అప్రమత్తంగా వుండాల్సి వుంటుంది.

దాదాశ్రీ : అవును, ప్రతి క్షణం అప్రమత్తంగా ఉండాలి. ఈ విధంగానే ఈ జ్ఞానం మొదలవుతుంది. ఈ జ్ఞానం ఆకస్మికంగా లభించలేదు. నేను మొదటి నుంచీ ఈ సర్దుబాట్లన్నీ చేసికొన్నాను. ఘర్షణలనుంచి దూరంగా ఉన్నాను.

నేను ఒకరోజు స్నానానికి వెళ్లినపుడు నీళ్లు పోసుకోవటానికి అక్కడ లోటా లేదు. నేను ఎడ్జస్ట్ చేసికొన్నాను. నేను చేతితో నీళ్లను పరీక్షించినపుడు అవి చర్మం ఊడివచ్చేటంత వేడిగా ఉన్నాయి. చల్లని నీళ్ల కోసం పంపు తిప్పితే ట్యాంక్ ఖాళీగా ఉందని తెలిసింది. నెమ్మదిగా, జాగ్రత్తగా నా దోసిళ్లతో నీళ్లు తీసుకొని చల్లార్చుకుంటూ స్నానం చేసాను. బయట మహాత్ములు ఇలా చెప్పుకోవటం వినిపించింది, "ఈ రోజు దాదా స్నానానికి చాలా సమయం తీసుకుంటున్నారు." నేనేమి చేయగలను. నీళ్లు చల్లారే వరకు వేచి వుండవలసి వచ్చింది. నేనెన్నడూ ఎవరికీ అసౌకర్యం కలిగించను. నేనే ఎడ్జస్ట్ అవుతాను. ఎడ్జస్ట్ అవటమే ధర్మము. ఈ ప్రపంచంలో కలపటం లేదా తీసివేయటం ద్వారా విషయాలను బ్యాలెన్స్ చేయటానికి మనం సర్దుబాట్లు చేసికోవాలి.

ఎక్కడ మైనస్ ఉందో నేను దానికి ప్లస్ చేస్తాను. ఎక్కడ ప్లస్ వుందో దానిని నేను మైనస్ చేస్తాను. ఎవరైనా నాతో నామాటలు అర్ధవంతంగా లేవని చెప్పినట్లయితే, అతను చెప్పింది నిజమేనని నేనతనికి చెప్తాను. నేను వెంటనే సర్దుబాట్లు చేసికొంటాను.

ఎలా ఎడ్జస్ట్ కావాలో తెలియకపోతే మీరు మనిషని ఎలా అన్పించుకోగలరు? ఎవరైతే తమ పరిస్థితులతో ఎడ్జస్ట్ అవుతారో వారికి ఇంట్లో ఏ విధమైన ఘర్షణలు ఉండవు. నేను హీరాబాతో ఎడ్జస్ట్ అయ్యేవాడిని. మీ భార్య సాహచర్య భాగ్యాన్ని మీరు అనుభవించదల్చుకొన్నట్లయితే మీరు తప్పక ఎడ్జస్ట్ కావాలి. లేకపోతే మీరు శత్రుత్వాన్ని సృష్టించుకొంటారు.

ప్రతి ప్రాణి స్వతంత్రమైనది మరియు సుఖాన్నే అన్వేషిస్తుంది. అతడు ఇతరులకు సంతోషాన్ని యివ్వటం కోసం రాలేదు. ప్రాపంచిక సుఖాన్వేషణలో అతనికి సుఖానికి బదులు దు:ఖం ఎదురైతే శత్రుత్వాన్ని ఏర్పరచుకుంటాడు ; అతని దారికి అడ్డువచ్చింది భార్యేకావచ్చు, బిడ్డలే కావచ్చు లేక కుటుంబ సభ్యులే కావచ్చు.

ప్రశ్నకర్త : సుఖాన్ని అన్వేషిస్తూ వచ్చినప్పటికీ సుఖం లభించకపోతే శత్రుత్వం ఏర్పరచుకొంటాడా?

దాదాశ్రీ : అవును. అతని దు:ఖానికి కారణం సోదరుడైనా లేక తండ్రి అయినా లోలోన వారి పట్ల శత్రుత్వాన్ని ఏర్పరచుకొంటాడు. ఈ ప్రపంచం అంతా ఇలాగే వైర బంధాలను ఏర్పరచుకొంటుంది. మోక్ష మార్గం (స్వధర్మం, ఆత్మధర్మం)లో ఎవ్వరూ ఎవరితోనూ వైరాన్ని సృష్టించుకోరాదు.

ప్రతి ఒక్క వ్యక్తి జీవితం కొన్ని సిద్ధాంతాలను అనుసరించి నడవాలి. పరిస్థితులను అనుసరించి ప్రవర్తించాలి. సందర్భానుసారంగా ఎవరు ఎడ్జస్ట్ అవుతారో వారు కీర్తించబడతారు. మరియు గౌరవించబడతారు. ప్రతి పరిస్థితిలోను ఎలా ఎడ్జస్ట్ కావాలో తెల్సుకొన్నచో మోక్షం కరతలామలకమవుతుంది. ఇది ఒక గొప్ప ఆయుధం.

ఈ దాదా అతిపొదుపరి, మితవ్యయి, ఉదారుడు మరియు పూర్తిగా సర్దుబాటు తత్వంకూడ కలవాడు. ఇతరుల విషయంలో ఉదారుడు, తన విషయానికొస్తే మితవ్యయి. ఉపదేశ విషయంలో చాలా పొదుపుగా ఉంటాడు. ఉపదేశం క్లుప్తంగా

ఉండి చాలా లోతైన అర్థాన్ని కల్గి వుంటుంది. నా అతిపొదుపు అలవాటుని ప్రజలుకూడ గుర్తించారు. నా పొదుపు సర్దుబాటు చేసికోదగినదిగా ఉంటుంది, సర్వోత్తమమైనది. నీటిని ఉపయోగించే సమయంలో కూడ నేను పొదుపు పాటిస్తాను. నేను స్వాభావికముగా మరియు సహజంగా ఉంటాను.

## లేనిచో సమస్యలు నీకు అవరోధాలను సృష్టిస్తాయి.

ముందుగా మనం ప్రపంచంలో వ్యవహరించే కళను నేర్చుకోవాలి. ఎలా వ్యవహరించాలో తెలియనందువల్లనే ప్రజలు అనేక బాధలు పడతారు.

ప్రశ్నకర్త : ఆధ్యాత్మిక విషయాలలో మీ విజ్ఞానం కంటె శ్రేష్ఠమైనది లేదు. ఏది ఏమైనా ప్రాపంచిక వ్యవహారాలకు సంబంధించి కూడ మీ మాటలు అభ్యసింపదగినవి, చాల ఉపయోగకరమైనవి, సర్వోత్తమమైనవి.

దాదాశ్రీ : వ్యవహారానికి సంబంధించిన ఈ కళను అర్థం చేసికొనకుండా ఎవ్వరికీ ముక్తి సాధ్యం కాదు. ఎంత అమూల్యమైనదైనప్పటికీ కేవలం ఆత్మజ్ఞానం ఒక్కటే ముక్తికి సహాయం చేయదు. ప్రపంచం కూడ మిమ్మల్ని వదిలిపెట్టాలి. ప్రపంచం మిమ్మల్ని స్వేచ్ఛగా వదలనిచో మీరేమి చేయగలరు? ప్రపంచం మిమ్మల్ని ఒంటరిగా వదిలినచో మాత్రమే మీరు శుద్ధాత్మ. మీరు ప్రపంచంలో చిక్కుకుంటూ ఉన్నారు. వీలైనంత త్వరగా ఆచిక్కుల్లోనుంచి బయటపడి స్వేచ్ఛని పొందాలని మీకు మీరుగా ఎందుకు యత్నించరు?

ఐస్‌క్రీమ్ కొనితెచ్చే నిమిత్తం నీవు ఒకరిని పంపించావు, అతడు రిక్త హస్తాలతో తిరిగి వచ్చాడు. కారణం అడుగగా, సగం దూరం వెళ్లాక గాడిద కన్పించిందని, అది అపశకునమని తాను నమ్మినందున తిరిగి వచ్చానని చెప్పాడు. ఇటువంటి మూఢ నమ్మకాలను, అంధ విశ్వాసాలను తొలగించవలసి వున్నది. ఆ గాడిదలో కూడ భగవంతుడు వసించి వున్నాడని అతడు తెలుసుకోవలసి ఉన్నది. అతడేర్పరచుకున్న అభిప్రాయాలు మరియు దురదృష్టం వంటి నమ్మకాలు కేవలం మూర్ఖత్వం. గాడిద పట్ల అతనికి కల్గిన తిరస్కార భావం దానిలో ఉన్న భగవంతుని చేరుతుంది. అతడొక

పాపకర్మను చేస్తున్నాడు. మీరీ విషయాలను అతనికి తెలియచెప్పి, మరల అతడు ఆతప్పు చేయకుండా అతనిని ఒప్పించగలరు. లేనిచో అజ్ఞానం ఇలాగే వృద్ధిపొందుతుంది. మూఢ జ్ఞానం వల్లనే ప్రజలు ఎడ్జస్ట్ కాలేకపోతున్నారు.

## యదార్ధ జ్ఞానం గలవారే ఎడ్జస్ట్ అవుతారు.

యదార్ధ జ్ఞానం యొక్క చిహ్నం ఏమిటి? యింట్లో మిగిలిన వారంతా మిస్ ఎడ్జస్ట్ అయినప్పటికీ, యదార్ధ జ్ఞానం కలవారొక్కరూ ఎడ్జస్ట్ అవుతారు. అన్ని పరిస్థితుల్లోను ఎడ్జస్ట్ అవ్వటం యదార్ధ జ్ఞానం యొక్క ఒక చిహ్నం. ప్రాపంచిక వ్యవహారాలను గురించి కడపటి మరియు సూక్ష్మ అన్వేషణ గావించిన తర్వాతనే నేను మీకీ విషయాలన్నీ చెప్తున్నాను. ఈ ప్రపంచంలో ఎలా జీవించాలో, ఎలా ముక్తిని పొందాలో నేను మీకు చూపుతున్నాను. మీ సమస్యలను, ఆటంకాలను తగ్గించటమే నాధ్యేయం.

మీరు చెప్పింది ఏమైనప్పటికీ అది ఎదుటివారికి ఆమోదయోగ్యంగా ఉండాలి. మీరు చెప్పింది అతనికి సమ్మతం కానిచో అది మీ తప్పు. మీ తప్పుని మీరు సరిచేసుకొన్నప్పుడు మాత్రమే మీరు ఎడ్జస్ట్ కాగలరు. 'ప్రతి చోట సర్దుకొని పోవాలి' ఇది మహావీర్ భగవానుని సందేశం.

ప్రశ్నకర్త : దాదా! మీరిచ్చిన ఈ 'ఎడ్జస్ట్ ఎవ్విరీవేర్' సందేశం ప్రతి సమస్యనూ పరిష్కరిస్తుంది. సమస్య యొక్క తీవ్రతతోగాని, ఆవ్యక్తి యొక్క స్వభావంతోగాని సంబంధం లేకుండా ఈ సూత్రం అన్ని సమస్యలనూ పరిష్కరించగలదు.

దాదాశ్రీ : అన్ని సమస్యలూ పరిష్కరించబడతాయి. నా ప్రతిమాటా మీ సమస్యలను పరిష్కరించి, మిమ్ము ముక్తులను చేస్తుంది. ప్రతి చోట సర్దుకొని పొండి.

ప్రశ్నకర్త : ఇప్పటివరకు మేము మాకు యిష్టమైన పరిస్థితులలో, యిష్టమైన వ్యక్తులతో మాత్రమే ఎడ్జస్ట్ అయ్యాం. యిష్టంలేని పరిస్థితులలో, మాకు యిష్టం లేని వ్యక్తులతో కూడ మేము ఎడ్జస్ట్ కావాలని మీరు చెప్తున్నారు.

దాదాశ్రీ : మీ యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ప్రతి చోట ఎడ్జస్ట్ కావాలి.

# దాదాజీ యొక్క అద్భుత విజ్ఞానం

ప్రశ్నకర్త : ఈ సర్దుబాటు వెనుకవున్న ఉద్దేశ్యం ఏమిటి? ఏ మేరకు మేము ఎడ్జస్ట్ కావలసి వున్నది?

దాదాశ్రీ : దీని ఉద్దేశ్యం మరియు లక్ష్యం శాంతి. అశాంతిని తప్పించుకొనుటకు ఇది తాళం చెవి. ఇది దాదా యొక్క సర్దుబాటు విజ్ఞానం. ఈ ఎడ్జస్ట్‌మెంట్ సుప్రసిద్ధమైనది. ఎడ్జస్ట్ కానిచో ఏమి జరుగుతుందో మీకు అనుభవమే. అననుకూలత మూర్ఖత్వం. సర్దుబాటు (అనుకూలత) న్యాయం. ఏ విధమైన మూర్ఖపు పట్టుదల అయినా (తన అభిప్రాయాన్నే గట్టిగా పట్టుకొని ఉండటం) న్యాయం అనిపించుకోదు. మీ దృష్టికోణమే సరైనదని ఏ విషయంలోనూ ఎన్నడూ ఇతరులను నిర్బంధించరాదు. నేనూ ఏ విషయంలోనూ మొండితనంగా వ్యవహరించను. జీవితంలో, విషయాలను త్వరగా ముగించుకోగలిగే మార్గాన్ని మీరు అనుసరించాలి.

నాతో ఎవ్వరూ ఎన్నడూ ఎడ్జస్ట్ కాలేకపోవడం జరగలేదు. ఇక్కడ ఇంట్లో నలుగురు మాత్రమే ఉన్నప్పటికీ ఒకరితో ఒకరు ఎడ్జస్ట్ కాలేరు. ఎలా ఎడ్జస్ట్ కావాలో మీరు నేర్చుకొంటారా? ఎడ్జస్ట్ కావటం అసాధ్యమా?నీవు గమనించిన వాటినుంచే నువ్వు నేర్చుకుంటావు. నువ్వు ఏమి చూస్తావో వాటినుంచి నువ్వు నేర్చుకోవాలనేది ప్రపంచ న్యాయం. ఎవరూ నీకు బోధించవలసిన పని లేదు. ఇందులో నేర్చుకోవటానికి కష్టమైనది ఏమైనా ఉన్నదా? నా ఉపదేశాన్ని నీవు అర్థం చేసుకోలేక పోవచ్చు. కానీ నా ప్రవర్తనను గమనించినట్లయితే నీవు తేలికగా నేర్చుకొంటావు.

నీకు ఇంట్లో ఎలా ఎడ్జస్ట్ కావాలో తెలియదు, కానీ కూర్చుని వేద పఠనం ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందాలని యత్నిస్తున్నావు. మిగిలిన విషయాలన్నీ విడిచిపెట్టు. మొదట ఎడ్జస్ట్ కావటం నేర్చుకో. ఇంట్లో ఏ విధంగా ఎడ్జస్ట్ కావాలనే ప్రథమ విషయం నీకు తెలియదు. ఇదే ప్రపంచం యొక్క సంక్లిష్ట లక్షణం.

నీకు ఈ ప్రపంచంలో ఏమీ తెలియకపోయినా అది పెద్ద సమస్యకాదు. నీవు చేసే పనికి సంబంధించిన పరిజ్ఞానం కూడ నీకేమాత్రం లేకపోవచ్చు. అయినా ఫర్వాలేదు. కానీ ఎలా ఎడ్జస్ట్ కావాలనే విషయాన్ని తెలుసుకోవటం అవసరం. దీనిని నీవు నేర్చుకోవాలి. లేకుంటే బాధపడతావు. ఈ సందేశాన్ని ఉపయోగించుకుని అత్యధిక ప్రయోజనాన్ని పొందు.

- జై సచ్చిదానంద్

## English Books of Akram Vignan of Dada Bhagwan

1. Adjust Everywhere **(English & Telugu)**
2. Avoid Clashes **(English & Telugu)**
3. The Fault Is Of the Sufferer **(English & Telugu)**
4. Whatever Happened is Justice **(English & Telugu)**
5. Who Am I ? **(English & Telugu)**
6. Ahimsa : Non-Violence
7. Anger
8. Aptavani - 1
9. Aptavani - 2
10. Aptavani - 4
11. Aptavani - 5
12. Aptavani - 6
13. Aptavani - 8
14. Aptavani - 9
15. Autobiography of Gnani Purush A.M.Patel
16. Brahmacharya : Celibacy Attained With Understanding
17. Death : Before, During & After...
18. Flawless Vision
19. Generation Gap
20. Harmony In Marriage
21. Life Without Conflict
22. Money
23. Noble Use of Money
24. Pratikraman : The master key that resolves all conflicts
25. Pure Love
26. Right Understanding to Help Others
27. Science of Karma
28. Science of Speech
29. Shree Simandhar Swami : The Living God
30. The Essence Of All Religion
31. The Guru and The Disciple
32. Tri Mantra : The mantra that removes all worldly obstacles
33. Worries

**'Dadavani' Magazine is published Every month in Hindi, Gujrati & English**

## Persons to Contact

### Dada Bhagwan Parivar

**Adalaj** : **Trimandir**, Simandhar City,
Ahmedabad-Kalol Highway, Adalaj,
Dist.: Gandhinagar - 382421, Gujarat, India.
**Tel :** (079) 39830100, **Email :** info@dadabhagwan.org

**Ahmedabad** : **Dada Darshan**, 5, Mamtapark Society,
Behind Navgujarat College, Usmanpura,
Ahmedabad- 380 014. **Tel. :** (079) 27540408

**Rajkot Trimandir** : 9274111393

**Bhuj Trimandir** : (02832) 290123

**Godhra Trimandir** : (02672) 262300

**Morbi Trimandir** : (02822) 297097

**Amreli Trimandir** : 9924344460

**Surendranagar Trimandir** : 9879232877

**Vadodara Dada Mandir** : 9924343335

---

**Hyderabad** : 9989877786

**Bangalore** : 9590979099

**Chennai** : 9380159957

**Hubli** : 9739688818

**Mumbai** : 9323528901

**Delhi** : 9810098564

---

**USA-Canada : DBVI**
**Tel. :** +1 877-505-DADA (3232)
**Email :** USA emails - info@us.dadabhagwan.org
Canada email - info@ca.dadabhagwan.org

**U.K. :** **AVDBF**
**Tel. :** +44 330-111-DADA (3232)
info@uk.dadabhagwan.org

**Kenya** : +254 722 722 063

**Australia** : +61 421127947

**UAE** : +971 557316937

**Singapore** : +65 81129229

**New Zealand** : +64 21 0376434

**Germany** : +49 700 32327474

**www.dadabhagwan.org**

## సర్వత్ర సర్దుకొనిపొండి

ఈ ప్రపంచంలో నీకు ఏ నేర్పు లేకున్నా ఫర్వాలేదు, కానీ ఎలా ఎడ్జస్ట్ కావాలో నీవు తెలుసుకోవాలి. ఎదుటి వ్యక్తి ఎంత ఉపద్రవకరమైన వాడైనప్పటికీ, అతని ప్రవర్తన జుగుప్సాకరంగానూ, పశుప్రాయంగానూ ఉన్నప్పటికీ అతనికి ఆశ్రయం ఇచ్చి ఎడ్జస్ట్ అవ్వగలిగినవారికి ఏ బాధలూ ఉండవు. అందువల్ల 'ఎడ్జస్ట్ ఎవ్విరివేర్' సర్వత్ర సర్దుకొని పోగలగటమే అన్ని ధర్మాలలోనూ ఉత్తమ ధర్మం. ఈ కాలంలో విభిన్న ప్రకృతులు, విభిన్న వ్యక్తిత్వాలు గల ప్రజలతో సర్దుబాటు లేకుండా పనులు ఎలా జరుగుతాయి?

ఈ ప్రాపంచిక జీవితాన్ని గురించి నా సూక్ష్మతమ అన్వేషణను వెల్లడించాను. నా చిట్టచివరి అన్వేషణని వెల్లడిస్తూ నేను మీకు ఈ విషయాలను చెబుతున్నాను. దైనందిన వ్యవహారాలలో ఇతరులతో మీరెలా ప్రవర్తించాలనే విషయంలో మాత్రమేకాక, మోక్షాన్ని ఎలా పొందాలనే విషయంలో కూడ నేను మీకు జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను. మీ బాధలను, విఘ్నాలను తగ్గించటమే నా ధ్యేయం.

\- దాదాశ్రీ

Telugu

dadabhagwan.org

Price ₹ 10